## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శతకరత్నములు

( ప్రథమ భాగము )

పండిత మల్లాది లక్ష్మీనరసింహాశాస్త్రిగారిచే

సంగ్రథితము.



పబ్లిషరు:—

కొండపల్లి వీరవెంకయ్యా,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

---

రాజమహేంద్రవరము:

శ్రీ సత్యానంద ప్రెస్‌నందు

ముద్రింపఁబడినది.

1930.

# పీఠిక.

పాఠకులారా !

ఆంధ్రభాషనానాటికభివృద్ధి నొందుచున్నది. ప్రజాసామాన్యము కూడఁప్రబంధముల నొకవైపునఁ జేతఁ బట్టుదినములువచ్చినవి. పద్యముల వోలెపాటలనుగూడ జనసామాన్యము భాషానియమంబుల పాటింపక చేతఁబట్టుకొని వల్లెవేయుదినము లరుదెంచినవి. విద్యావిధానమునకు జన సామాన్యము నేర్వవలెనన్న భక్తివైరాగ్యజ్ఞాననీతిదాయకంబులగు శతకములను జేతఁబట్టవలయును. సాధారణముగా జనసామాన్యము కృష్ణ కుమారీత్యాదిశతకవింశతికంటె నెక్కుడెఱుంగదు. అన్నిశతకముల లోని పద్యరత్నములను భాషాసేవకులకందజేసి కంఠపాఠము చేయించవల యుననియే మాయుద్దేశము. అందులకుగా మాసోదరు లిదివఱకెరిగి యున్న శతకములందలి పద్యములను ప్రారంభమునను మధ్యమధ్యను జొన్పి ప్రాచీననవీన శతకములలో సుమారు వేయింటనుండి నూఱుశత కంబులనెత్తియందలి రత్నఘుటికలనేర్చి పేర్చితిమి.

శైలికై యందలిపద్యముల రెండింటిని మచ్చునకిచ్చియుంటిమి.

చ. సనకసనందనాదిముని సత్తములుత్తమ భక్తియుక్తిసా
ధనముననంబుజాక్షుని పదంబులసేవ యొనర్చిధన్యులై
మనుటయెరింగియింక కొఱమాలినవారలవేడనేల నీ
వనవరతానురక్తి మనసా హరిపాదములాశ్రయింపుమా.

(మానసబోధశతకము.)

ఉ. రాజులమేటిరాజురఘురాజ మహాత్ముడురాజమాన్యుడై
రాజితకీర్తిశాలియగు రాముడురాజ్యభిలాషసక్తుడై
యాజగమేలురాజులకు నిష్టజనంబులు నింపొనర్చుమా
భూజనభక్తరక్షకుడు భూతిదలంచెప్రసన్నరాఘవా.

(ప్రసన్నరాఘవశతకము.)

# విషయసూచిక.

---:o:---



# శతకరత్నములు.

ప్రథమ భాగము.

## దాశరథీశతకము.

———:o:———

శ్రీరఘురామ చారు తులసీదళదామ శమక్షమాది శృం
గార గుణాభిరామ త్రిజగన్నుత శౌర్యలలామ దు
ర్వారక బంధరాక్షసవిరామ జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ.

ఉ. శ్రీదసనందనాది మునిసేవితపాద దిగంతకీర్తిసం
పాదితసుప్రసాద భవపాశవిభేద విషాదవల్లికా
చ్ఛేదధరాధి నాథకులసింధు సుధామయపాద నృత్తగీ
తాదివినోద భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ. 2

చ. దురితల తాలవిత్రఖరదూషణ కాననవీతిహోత్రభూ
భరణకళావిచిత్రభవ బంధవిమోచన సూత్రచారువి
స్ఫురదర విందనేత్ర ఘనపుణ్యచరిత్ర వినీలభూరివా
గ్వరసమగాత్ర భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ. 3

ఉ. శ్రీరఘువంశతో యధికిశీతమయూఖుఁడవైన నీపవి
త్రోరుపదాబ్జము ల్వికసితోత్పలచంపక వృత్తమాధురీ
పూరిత వాక్ప్రసూనములఁ బూజలొనర్చెదఁ జిత్తగింపుమే
తారకనామ భద్రగిరిదాశరథీ కరుణాపయోనిధీ. 4

ఉ. శ్రీరమసీతగాఁగ నిజసేవకబృందము వీరవైష్ణవా
చార్యజనంబుగాఁగ విరజానది గౌతమిగా వికుంఠము
న్నారయభద్రశైల శిఖరాగ్రముగా నెలకొన్న చేతనో
ద్ధారకుఁడైన విష్ణుఁడవు దాశరథీకరుణాపయోనిధీ. 5

చ. అజునకు దండ్రివయ్యు సనకాదులకుం బరతత్త్వమయ్యు స
ద్ద్విజముని కోటికెల్లకుల దేవత వయ్యు దినేశవంశభూ
భుజులకు మేటివయ్యు పరిపూర్ణుఁడవై వెలుఁగొందుపక్షి రా
డ్ధ్వజమిము బ్రస్తుతించెదను దాశరథీకరుణాపయోనిధీ. 6

ఉ. కంటినదీతటంబు బొడగంటినిభద్రనగాధి వాసముం
గంటిని లాతనూజనురుకార్ముక మార్గణశంఖచక్రముల్
గంటిని మిమ్ము లక్ష్మణుని గంటికృతార్థుఁడనైతినో జగ
త్కంటకదైత్య నిర్దళన దాశరథీకరుణాపయోనిధీ. 7

చ. హలికునకున్ హలాగ్రమున నర్థముచేకురుభంగిదప్పిచే
నలమటఁజెందు వానికి సురాపగలో జలమబ్బినట్లు దు
ర్మలినమనోవికారి యగుమర్త్యుని నన్నొడఁగూర్చి నీపయిం
దలపు ఘటింపఁజేసితివి దాశరథీకరుణాపయోనిధీ. 8

ఉ. చక్కెరమాని వేముఁదినఁజాలినకైవడి మానవాధముల్
పెక్కురు బక్కదైవముల వేమఱుగొల్చెదరట్లకాదయా
మ్రొక్కిన నీకుమ్రొక్కవలె మోక్షమొసంగిన నీవయీవలెన్
దక్కిన మాటలేమిటికి దాశరథీకరుణాపయోనిధీ. 9

చ. హరునకు నవ్విభీషణున కద్రిజకుందిరు మంత్రరాజమై
కరికినహల్యకుం ద్రుపదకన్యకు నార్తిహరించుచుట్టమై
పరగినయట్టి నీపతితపావన నామము జిహ్వాపై నిరం
తరమునటింపఁ జేయుమిక దాశరథీకరుణాపయోనిధీ. 10

ఉ. అండజవాహనిన్ను హృదయంబున నమ్మినవారి పాపముల్
కొండలవంటివైన వెసగూలి నశింపక యున్నె సంతతా
ఖండలవైభవోన్నతుల గల్గకమానునె మోక్షలక్ష్మికై
దండయొసంగకున్నె తుద దాశరథీకరుణాపయోనిధీ. 11

చ. సిరులిడసీతపీడ లెగజిమ్ముటకున్ హనుమంతుఁడార్తి సో
దరుడుసుమిత్రసూతి దురితంబులు మానుపరామనామముం
గరుణదలిర్పమానవుల గావగపన్నిన వజ్రపంజరో
త్కరముగదా భవన్మహిమ దాశరథీకరుణాపయోనిధీ. 12

చ. జలనిధిలోన దూటికులశైలము మీటిధరిత్రిఁగొమ్మునం
దలవడ మాటిరక్కసుని యంగముగీటి బలీంద్రుని న్సరసా
తలమున మాటి పార్థివకదంబముగూల్చిన మేటిరామ నా
తలపుననాటి రాదగదె దాశరథీకరుణాపయోనిధీ. 13

ఉ. జుట్టెదనీకథామృతము జుట్టెదనీపదకంజతోయమున్
జుట్టెదరామనామమును జొబ్బిలుచున్న సుధారసంబునే
జుట్టెదజుట్టుజుట్టుగ రుచుల్ గనువారిపదంబుఁ గూర్పనే
తట్టులతోడి పాత్రిడక దాశరథీకరుణాపయోనిధీ. 14

ఉ. పెంపనుతల్లివై కలుషబృందసమాగమ మొందకుండ ర
క్షింపను దండ్రివై మదివసించుచు నాదిజరోగముల్ నివా
రింపను వెజ్జవై కృపగురించి పరంబు దిరంబుగాగ స
త్సంపదలియ్య నీవెగతి దాశరథీకరుణాపయోనిధీ. 15

చ. కలియుగమర్త్యకోటినిను గన్గొనరాని విధంబొ భక్తవ
త్సలతవహింపవో చటులసాంద్రవిపద్దశవార్ధి గ్రుంకుచో
బిలిచిన బల్కవింతమఱుపే నరుడిట్లనరాదుగాక నీ
తలపునలేదె సీతచెర దాశరథీకరుణాపయోనిధీ. 16

చ. అగణితజన్మకర్మదురితాంబుధిలో బహుదుఃఖవీచికల్
దెగిపడనీదలేక జగతీధవనీ పదభక్తినావచే
దగిలితరింప గోరితిపదంపడినాదు భయంబుమాన్పవే
తగదని చిత్తమందిడక దాశరథీకరుణాపయోనిధీ. 17

ఉ. నేనొనరించు పాపములనేకములైనను నాదుజిహ్వకున్
బానకమయ్యె మీపరమపావననామము దొంటిచిల్కరా
మాననుగావుమన్న తుదిమాటకు సద్గతిజెందెగావునన్
దానిధరింపగోరెదను దాశరథీకరుణాపయోనిధీ. 18

చ. సలలితరామనామ జపసారమెఱుంగను కాశికాపురీ
నిలయుడగాను నీచరణనీరజరేణు మహాప్రభావముం
దెలియనహల్యగాను జగతీధవ నీదగుసత్యవాక్యమున్
దలపగ రావణాసురుని దమ్ముడగాను భవద్విలాసమున్
దలఁచి నుతింపనాతరమె దాశరథీకరుణాపయోనిధీ. 19

ఉ. దాచినచుట్టమా శబరిదానిదయామతినేలినావు నీ
దాసునిదాసుడా గుహుడుతావకదాస్యమొసంగినావు నే
జేసినపాపమా వినుతిచేసిన కావవుకావవయ్య నీ
దాసులలోననే నొకడ దాశరథీకరుణాపయోనిధీ. 20

ఉ. నీలఘనాభమూర్తి వగునిన్ను గనుంగొనఁ గోరివేడినన్
జాలముసేసి డాగెదవు సంస్తుతికెక్కిన రామనామమే
మూలనుదాచుకో గలవు ముక్తిని ప్రాపదిపాపమూలకు
ద్దాలముగాదె మాయెడల దాశరథీకరుణాపయోనిధీ. 21

చ. జలనిధులేడు నొక్కమొగిజక్కికి దెచ్చెశరంబురాతినిం
పలరగఁ జేసెనాతిగ పదాబ్జపరాగము నీచరిత్రమున్
జలజభవాది నిర్జరులు సన్నుతిసేయగలేరు గావునన్
దలపనగణ్యమయ్యె యిది దాశరథీకరుణాపయోనిధీ. 22

ఉ. దైవము తల్లిదండ్రి తగుదాతగురుండు సఖుండు నిన్నె కా
భావనసేయుచున్న తరిబాపములెల్ల మనోవికారదు
ర్భావితుజేయుచున్నవి కృపాపతివై నను గావుమీ జగ
త్పావనమూర్తి భద్రగిరిదాశరథీకరుణాపయోనిధీ. 23

## దాసపోషశతకము.

—:o:—

ఆ. తలచినకార్యంబు తక్షణంబున జేయ
కొరగాదు భూపతికొడుకుకైన
భక్తిసలుపకున్న భగవంతు నెఱుగునా
ధరనుయడ్ల రామదాసపోష. 1

ఆ. సాధనంబులేక సమకూడ దెయ్యది
వాదభేదముచేత రాదుముక్తి
పాదుకొన్న తనలో పరతత్వమెఱుగక
ధరనుయడ్ల రామదాసపోష. 2

ఆ. మాటలెన్నియునేర్చి మహిమాలుజూపిన
వాటమైనట్టి త్రికూటమునను
సూటి తెలియనివాని పాటెంతు గాబుధులు
ధరనుయెడ్ల రామదాసపోష. 3

ఆ. సన్యాసులమనుచు సంచరింపగనేల
అన్యాయముడిగితే నదియచాలు
మనసుసన్యసించి మగ్నుడై తేముక్తి
ధరనుయెడ్ల రామదాసపోష. 4

ఆ. విద్యలెన్నియునేర్చి ప్రజ్ఞవారిల్లినబ్రహ్మ
విద్యనేర్వకున్న విడదవిద్య
తథ్యము యీమాటసజ్జనులకే తెలుసు
ధరనుయెల్లరామదాసపోష. 5

ఆ. చిప్పలోవిలువైన గొప్పమౌక్తికమున్న
చొప్పణగినటువలె సాధుఁడుండు
కప్పలుఘోషించి కడకేమిగాంచెను
ధరనుయెల్లరామదాసపోష. 6

ఆ. కాకికోవిలయేక కరణిగానుండును
పట్టిపరిశోధింప పలుకువేరె
మనుజులలోనట్లు మహనీయులుందురు
ధరనుయెల్లరామదాసపోష. 7

ఆ. పుస్తకములన్నియు పొలతులవంటివి
విస్తరించిచూడ యిష్టమౌను
ప్రస్తుతము వేమకవిమ్మాట చెప్పెనో
ధరనుయెల్లరామదాసపోష. 8

ఆ. ప్రాణహానికంటె పాపమింకెయ్యది
జనులుప్రాణహాని జేయరాదు
జీవకోటియెల్ల శివునిస్వరూపమే
ధరనుయెల్లరామదాసపోష. 9

ఆ. ప్రాణికోటికంటె పరమాత్ముడెవ్వడు
నాణ్యమెరుగలేరు నరులుభువిని
రాణువిట్లుండగా రహస్యమెందుకుతెలియు

ఆ. ఆశయనెడిభూత మావరించుటచేత
తన్ను దెలియమనసు తగిలిరాదు
దేశికుని కృపలేక దీని తెలియగరాదు
ధరనుయెల్ల రామదాసపోష. 11

ఆ. మనసు కెరుకలేని మర్మమొక్కటిలేదు
మనసు చేష్టలుడిగి మరలెనేని
మనసు అచలమందు మగ్నమైయుండును
ధరనుయెల్ల రామదాసపోష. 12

ఆ. నిండుకుండకుతూటు నేవైపుపడ్డను
జలమునేలగలయు జనులకెల్ల
మనసుయనెడుజలము మరలువిషయములకు
ధరనుయెల్ల రామదాసపోష. 13

ఆ. పెద్దలాడుమాట పెడచెవులబెట్టక
శ్రద్ధతోయోగంబు సేయునేని
వ్యర్థముగాబోదు యేజన్మమునకైన
ధరనుయెల్ల రామదాసపోష. 14

ఆ. ముక్తికాంతతోడ ముచ్చటించెడివాడు
యితరకాంతలందు యిష్టపడడు
కష్టంబులకునెల్ల కారణంబీసతులు
ధరనుయెల్ల రామదాసపోష. 15

ఆ. సతులమాయల సగసామాన్యములుకావు
మతులుగరుగుస్త్రీల మహిమసోకి
ఘృతము నిప్పుజూచి కుదురుగనిలచునా
ధరనుయెల్ల రామదాసపోష. 16

ఆ. కాంతకనులుతీరు కడువేడ్కతోజూచి
విరహాగ్నిచేగాలు విటులమేను
మగువకడుపునుండు మలమూత్రమెఱుగరు
ధరనుయెడ్ల రామదాసపోష. 17

ఆ. పతివ్రతలగువారు పతియాజ్ఞదప్పక
పనులుచేయుచుండ్రు పరముగోరి
మతిమంతులగుస్త్రీల మార్గమిట్లుండును
ధరనుయెడ్ల రామదాసపోష. 18

ఆ. శివునిపరిణయంబు చేయుచుండెడిబ్రహ్మ
చూచిపార్వతిపైని ఆశపడియె
స్త్రీలమీదనాశ లేనివాడెవ్వడో
ధరనుయెడ్ల రామదాసపోష. 19

ఆ. పుట్టుచావురెంటి పొత్తుగోరకనుండి
యుత్తమైనబయల నుండగోరి
తత్తరపడకున్న తాబ్రహ్మమైయుండు
ధరనుయెడ్ల రామదాసపోష. 20

ఆ. ఆత్మనెఱిగినట్టి యార్యులసేవింప
మూలమెరుగునెట్టి మూఢులైన
యినుముపరుసముసోకి హేమించినటువలె
ధరనుయెడ్ల రామదాసపోష. 21

---

# కృ ష్ణ శ త క ము.

———:o:———

క. హరియను రెండక్షరములు
హరియించును బాతకముల నంబుజనాభా
హరినీనామ మహత్త్వము
హరియనిపొగడంగ వశమె హరిశ్రీకృష్ణా. 1

క. క్రూరాత్ముఁడ జామిళుఁడు
నారాయణయనుచునాత్మ నందనుబిలువ
న్నేరీతినేలుకొంటివి
యేరీనీసాటివేల్పు లెందునుకృష్ణా! 2

క. పాణితలంబున వెన్నయు
వేణీమూలంబునందు వెలయఁగపింఛం
బాణీముత్యము ముక్కున
జాణుడవై తాల్చు శేషశాయివికృష్ణా! 3

క. దేవేంద్రుడలుకతోడను
వావిరిగారాళ్ళవాన వడిగురియింపన్
గోవర్ధన గిరినెత్తితి
గోవులగోపకులగాచు కోఱికై కృష్ణా! 4

క. దుర్జనులగు నృపసంఘము
నిర్జింపగదలచినీవు నిఖిలాధారా
దుర్జనులను వధియింపను
నర్జునునకు నీవు సారథైతివికృష్ణా. 5

క. కుక్షిని నఖిలజనంబులు
నిక్షేపముచేసిప్రళయ నీరధినడుమన్
రక్షకవటపత్రముపై
దక్షత పవళించునట్టి ధన్యుడకృష్ణా. ౬

క. మగమీనమవై జలధిని
పగతునిసోమకునిజంపి పద్మభవునకున్
నిగమములు దెచ్చియిస్తివి
సుగుణాకరమేలుదివ్య సుందరకృష్ణా.

క. అందఱు సురలును దనుజులు
బొందుగక్షీరాబ్ధిదఱువ బొలుపుననీవున్
అందముగ కూర్మరూపున
మందరగిరియెత్తితౌర మాధవకృష్ణా. ౮

క. ఆదివరాహామవయ్యును
నాదనుజుహిరణ్యానేత్రు హతుఁజేసితగన్
మోదమున సురలు పొగడగ
మేదినిగిరి గొడుగునెత్తి మెఱసితికృష్ణా. 9

క. కెరలియరచేతగంబము
నరుదుగవ్రేయుటయు వెడలి యసురేశ్వరునిన్
యురమును జీరివధిస్తివి
నరహరిరూపావతార నగధరకృష్ణా. 10

క. వడుగై ధర మూడడుగులు
నడిగితివో భళిగ భళిర యఖిలజగంబుల్
దొడిగితివి నీదుమేనను
గనుచిత్రము నీచరిత్రఘనమాకృష్ణా. 11

క. ఇరువదొకమారు నృపతుల
శిరములుఖండించితౌర చేగొడ్డంటన్
దరగశ్యపునకు నిచ్చియు
పరగ వెజమదగ్ని రామ భద్రుడకృష్ణా. 12

క. దశకంఠుని బరిమార్చియు
కుశలముతో సీతదెచ్చుకొనియు నయోధ్య
న్విశదమగు కీర్తినేలిన
దశరథరామావతార ధన్యుడకృష్ణా. 13

క. ఘనులగు ధేనుకముష్టిక
దనుజుల జెండాడితౌర తగభుజశక్తిన్
అనఘాత్మ రేవతీపతి
యనగా బలరామమూర్తివైతివి కృష్ణా. 14

క. త్రిపురదైతేయభార్యలు
నిపుణతతో వ్రతముసలిపి నిలిపినకీర్తుల్
కపటపురాజవు భళిరే
కృపగలబౌద్ధావతార కేశవకృష్ణా. 15

క. వలపుల తేజీనెక్కియు
యిలపై ధర్మంబునిలువ హీనులద్రుంపన్
కలియుగము తుదినివేడుక
కలికివిగాకున్నలోక కర్తవుకృష్ణా. 16

క. హరినీవదిక్కునాకును
సిరితోనేతెంచిమకరి శిక్షించిదయన్
పరమేష్టిసురలు పొగడగ
కరిగాచిన రీతినన్ను గావుముకృష్ణా. 17

క. పురుషోత్తమ లక్ష్మీపతి
సరసిజగర్భాదిమౌని సన్నుతచరితా
మురభంజన సురరంజన
వరదుఁడవగునాకు భక్తవత్సలకృష్ణా... 18

క. తురగాధ్వరంబు జేసిన
పురుషులకును వేరపదవి పుట్టుట యేమో
హరిమిముఁదలచినవారికి
అరుదా కైవల్యపదవి యచ్యుతకృష్ణా... 19

క. గంగమొదలైననదులను
మంగళముగజేయునట్టి మజ్జనములకున్
సంగతి గలిగిన ఫలములు
రంగుగమిము దలచుసాటి రావుగకృష్ణా... 20

క. చూపుము నీరూపంబును
పాపపుదుష్కృతములెల్ల పంకజనాభా.
పాపుము వేగమదయతో
శ్రీపతి నిను నమ్మినాడ సిద్ధముకృష్ణా... 21

## రామలింగేశశతకము.

:o:

సీ. ఆశకుముదిమియునర్థికి సౌఖ్యంబు
ధనపరాయణునకు ధర్మచింత
కఠినమానసునకు గరుణాపరత్వంబు
వెఱ్ఱిమానిసికి వివేకగరిమ
అల్పవిద్యునకు నహంకారదూరత

బహుజనద్వేషికి పరమాయురభివృద్ధి
గ్రామపాచకునకు గౌరవంబు
గీ. తామసగుణాఢ్యునకును సత్త్వగుణయుక్తి
పాపభీరుతసంతాన భాగ్యలకును
కలదనెడువార్తగలదె లోకమునయందు
రామలింగేశ రామచంద్రపురవాస. 1

సీ. శక్తిచాలనివాడు సాధుత్వమువహించు
విత్తహీనుడు ధర్మవృత్తి దలచు
వ్యాధిపీడితుడు దైవభక్తి బూరలాడు
ముదిది పాతివ్రత్యమునకుజొచ్చు
నాపదప్రాప్తింప నన్యార్తికిగృశించు
భారంబుపైబడ్డ బరువెఱుంగు
రమణిలేకున్న విరక్తిమంచిదియను
బనిపోవమాని వర్తనముదాల్చు
గీ. నీయభావవిరక్తుల కేమిఫలము
తినకచలిచౌరకయె లోతుతెలియబడునె
యెంతవానికినైన మహీస్థలమున
రామలింగేశరామచంద్రపురవాస. 2

సీ. తల్లిసేవించిన దైవతార్చనయేల
తండ్రిగల్గిన పెన్నిధానమేల
దీనరక్షణమున్న దీర్ఘాటనంబేల
విద్యాధికతయున్న వేషమేల
పరమమిత్రుండున్న బంధువర్గంబేల
పతిభక్తిగలిగిన వ్రతములేల

ధవుడుపిన్నైన వైధవ్యంబుదప్పునె
మనడె దీర్ఘాయువుమందలేక
గీ. యర్కుడుదయింపజేయునె గుహాతిమిరము
తాళమెత్తుకపోవ మందసములోని
విత్తమలవడకుండునే వెచ్చమునకు
రామలింగేశ రామచంద్రపురవాస. 7
సీ. ఆరగించంగ యోగ్యముగాకయుండునే
పైతొక్కబిరుసైన పనసఫలము
మాధుర్యమెడలునే మామిడిపండుకు
దొడిమెపట్టిన జీడిగోరలియున్న
కేదంగివిరమాళి గీలింపకుండిరే
యగ్రభాగమున ముండ్లలమికొన్న
నఖలాంగసీమ యొయ్యారంబుగలిగిన
యతివకువాల్ జన్నులైననేమి
గీ. గుణముబహుళంబు దోసంబు కొంచెమైన
గొదవజెందకయుండు నెక్కుడుగుణంబు
తాలుమాత్రైననిదియె పద్ధతితలంప
రామలింగేశ రామచంద్రపురవాస. 8
సీ. గోవధగావించి గోరోజనమ్మురోగా
ర్తులకొసగ బుణ్యాత్ముడగునె
ఫలశాఖపడమొత్తి ఫలములేఋంచి భూ
సురులకర్పించిన సుకృతియగునె
నింపుతటాకంబు ఖండించిచేపల
మత్స్యభుక్కులదన్ప మాన్యుడగునె

గుడిగొట్టియుటికలు గూరిచి తులసిదిన్నె
లురచించిన ధర్మనిరతుడగునె
గీ. పరిబలపాతకపూర్ణు డల్పంపుసుకృత
మునను శుద్ధుండు గాకుండుననుటనిక్క
మాడుగాకేమి యిచ్ఛకంబస్మృతవాది
రామలింగేశరామచంద్రపురవాస. 9

సీ. చెఱువులోనీరునిల్చిన బానయోగ్యమా
నదివార్ధిజేర బానార్హమగునె
యుదకమల్పంబైన నుచ్ఛలోబకుజేప
చెఱువునిండినవేళ జిక్కునెట్లు
చరణాయుధాండంబు చట్టెడౌనోర్చిన
నవయంగజేసిన నల్పభుక్తి
వహ్నియల్పంబైన వలననేమనగూడ
దదియుమండింప మేడలగాల్చు
గీ. నాక్రమింపగదగినచో నరివధింప
దగుఫలావేక్షకోర్మి యోధత్వమునకు
వస్తుతత్త్వంబుపరికింపవలయుజూడ
రామలింగేశరామచంద్రపురవాస. 10

సీ. చేరువనపగయును దూరపుమైత్రియు
గావించెనేనియు గార్యహాని
స్వనృపుతోవైర మన్యనృపాలుతోమైత్రి
యొనరించెనేని గీడొదవకున్నె
త్యాగంబునకునాత్మ భోగంబునకుగాని
విత్తార్జనంబు గావింపనేల

బానకులోనైన బ్రతిభావలాడిన
బాలతితో భాషింప బోవదగదు
గీ. ఇట్టిసయమార్గమెఱుగక యిచ్ఛవచ్చి
నట్లు చరియించువారికి హానిచెందు
పాడికల్గదు యిదినిక్కమరసిచూడ
రామలింగేశ రామచంద్రపురవాస. 11
సీ. తెరువాట్లుగొట్టి సత్తువుపెట్టుటకంటె
న్యాయార్జితాన్న మింతైనమేలు
దోటలుసఱికిన దొడ్డసావిడికంటె
ననఘమైతగుపంచయరుగు మేలు
బహుఘాతకులు పెట్టు పాయసాన్నముకంటె
సద్వర్తకులు పెట్టు జావమేలు
అందఱజెఱిచి వెయ్యారులిచ్చుటకంటె
గష్టార్జితంబొక్క గవ్వమేలు
గీ. గర్వపడుదురు తమపాట్లుగానలేక
ప్రభువులమటంచు దుర్నయోపాయపరులు
వారిబాగడంగ మాకుత్సవంబు లేదు
రామలింగేశ రామచంద్రపురవాస.
సీ. ఆక్రమింపగవచ్చు నన్యరాష్ట్రంబులు
ప్రజలనందఱి బాధపఱుపవచ్చు
నన్యాయవిత్తంబు లార్జింపగావచ్చు
విభవంబు పెంపు గావింపవచ్చు
మిత్రాధికారంబు మీటివేయగవచ్చు
మహితాపరాధంబు మఱపవచ్చు

నొక్కమాటపల్కి వేరొకటిసేయగవచ్చు
సంపదున్నతికి గర్వింపవచ్చు
గీ. నాయువధికంబుగా గూర్పఁగలవియగునె
దుర్నయులు మీఁదెఱుంగక త్రుళ్ళిత్రుళ్ళి
యిహపరములకు వెలియౌదురంతెకాక
రామలింగేశరామచంద్రపురవాస. 13

సీ. మేలుచేసినయట్టి మిత్రులజెడగొట్టి
పెద్దకిరీటంబు బెట్టనేల
తనప్రాపుగోరు భూధవులకెగ్గొనరించి
గంధసింధురముల గట్టనేల
తనుగొల్చుబంటజీతములు తక్కువచేసి
ఘోటకంబులు పెక్కుగూర్చనేల
ప్రజలనుబడరానిపాట్ల కగ్గముచేసి
యగ్రహారములు సేయంగనేల
గీ. యధికనిందామలీమసుడైనయట్టి
నృపునికిశుభవిభవ సమృద్ధులెల్ల
శవకృతాలంకృతులుగావె చర్చసేయ
రామలింగేశరామచంద్రపురవాస. 14

సీ. మలయభూధర పవమానమల్పంబయ్యు
ఝంఝానిలముకంటె సౌఖ్యకరము
చెలమలోపలిజలంబులు కొద్దియయ్యును
జలధితోయముకంటె శర్మదంబు
సలతియయ్యువిపంచి కలమఁజులధ్వని
భేరీరవముకంటె ప్రియకరంబు

కొంచెమయ్యు సువర్ణకుసుమంబుపృథు
జర్ణికారంబుకన్న సౌఖ్యప్రదంబు
గీ. గుణముగలవాని సంపదకొంచెమయ్యు
సర్థిజనులకు బ్రియకరంబగుచునుండు
నెంతసిరియున్న బనియేమిమొడ్డెలకును
రామలింగేశ రామచంద్రపురవాస. 15

---

# కోదండరామశతకము.

—:o:—

క. శ్రీసీతాహృదయేశ్వర
వాసవముఖ నిఖిలదేవ వర్ణితచరితా
దాసనుత యింటిముక్కల
వాసా కోదండరామ పరసుభనామా.
క. రక్షోవంశ విభంజన
పక్షికులాధ్యక్షగమన పన్నగచయనా
రక్షించుమునను త్రిజగ
ద్రక్షా కోదండరామ దనుజవిరామా.
క. మందరధరముని నందిత
సుందరపాదారవింద శుభగుణబృందా
కందర్ప జనకసుజనా
నందా కోదండరామ నతదృధసోమ.
క. దశకంధరు చేబాధల
దిశచెడినిన్వేడుకొనినిత్రిదశులబ్రోవన్

దశరథునికి బుట్టితినత
శశిధర కోదండరామ జలదశ్యామా. 4

క. విశ్వామిత్రునితోజని
విశామిత్రులనుదునిమి వెలసితివిభళీ
విశ్వముబ్రోచెడికై జగ
దీశ్వరకోదండరామ యినకులసోమా. 5

క. జనకుడుముదమున మీపద
వనజంబులుగడిగియీడె వసుధాతనయం
గనకాంబరధర త్రిభువన
జనకాకోదండరామ జలదశ్యామా. 6

క. ధీరుండగు భృగురాముడు
దారికివడ్డంబురాగ దర్పమువెల్లం
బోరనడించిన శ్రీరఘు
వీరాకోదండరామ వినుతవిరామా. 7

క. శిరమునపాదుకలిడుకొని
పరమోత్సాహంబుతోడ బట్టణమునకున్
భరతుండరిగెనుగదకరి
వరదాకోదండరామ వరగుణధామా. 8

క. భరతుడుమీపాదుకలను
నిరతముబూజింపుచుండె నిశ్చలమతియై
వరనందిగ్రామంబున
సరసతకోదండరామ సంగరభీమా. 9

క. సుందరరూపకురంగము
ముందరగనబడగజూచి ముదమునమిముభూ

నందనయుబట్టితెమ్మనె
సుందరకోదండరామ సుగుణస్తోమా.

క. శరణన్ననావిభీషణు
గరుణంరక్షించివార్ధి గట్టించియువా
నరవరులుగొలువలంకకు
నరిగితెకోదండరామ యసురవిరామా.

క. కమలభవాదులుమైథిలి
విమలవ్రతనాధరింప వేయనివేడన్
గమలాననజేకొంటివి
సుమహిదకోదండరామ సుగుణస్తోమా.

క. శ్రితజనవత్సలమానస
శ్రుతిగణసంస్తూయమాన శుభచరితమరు
త్పతిముఖపూజితచరణ
ద్వితియాకోదండరామ వినుతవిరామా.

---

# శ్రీ వేంకటేశ్వరశతకము.

---:o:---

చ. సిరిగలమీపదాబ్జములు చిత్తములోనెరనమ్మి భక్తితో
గరములుమోడ్చిమ్రొక్కెదను గంజదళాక్ష మహానుభావ నీ
వరమరలేకమోదమున నారసిసత్కృపతోడ ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుము వేగ శ్రీపతీ.

చ. సరసిజనాభచక్రధర సామజరక్షణ పాపసంహరా
నరహరికేశవాచ్యుత జనార్దనశౌరి మురారిమాధవా

వరదవికుంఠవాసయని వర్ణనచేసెద నయ్యద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుము వేగ శ్రీపతీ. 2

చ. తరణినిగాంచుపద్మ సముదాయము భంగినిగల్వలున్ సుధా
కరుగనివేడ్కనొందుక్రియ గంజదళాయతనేత్ర నేను మీ
స్ఫురితపదారవిందములు జూపినధన్యుడనౌదు ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుము వేగ శ్రీపతీ. 3

చ. సిరియలసీతయయ్యెనిల శేషుడు లక్ష్మణుడయ్యె దేవమీ
కరములశంఖచక్రములు కార్యముకై శ్రుతకీర్తినాథుడున్
భరతుడనయ్యెనార్తజన పాలనరాముడవీవె ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుము వేగ శ్రీపతీ. 4

చ. కరివరభీష్మశౌనక శుకప్రహ్లాద విభీషణాదులం
బరమకృపాతిరేకమున బాలనజేసితివంచునమ్మియీ
కరణిని నన్నుగావుమని కాంక్షతో వేడెదనయ్య ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుము వేగ శ్రీపతీ. 5

చ. అరగడియైనమీభజన నాత్మనునమ్మిభజింపనైతి నే
మరకనురామకృష్ణయను మంత్రమునెన్నడు బల్కనైతినా
తరమెభవాబ్ధినీదుటకు దాటగనావవునీవె ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుమువేగ శ్రీపతీ. 6

చ. కరిమకరోగ్రదంష్ట్ర నఖకర్కశవేదన కోర్వలేకయో
హరిహరి కావవేయనుచు నార్తరవంబున నిన్ను వేడగా
పరమకృపాతిరేకమున బాలనజేసితివీవె ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుమువేగ శ్రీపతీ 7

చ. సురుచిరవేదముల్ గొనుచు సోమకుడంబుధిలో నడాగినన్
నిరుపమమీనరూపమున నీరధిజొచ్చి శ్రుతిప్రచోరుని

న్నరికివిధాతకాదరమునన్ శ్రుతులిచ్చితివీవె ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుమువేగ శ్రీపతీ. 8

చ. సురదనుజాళి మందరముసొంపుగ కవ్వముబాముత్రాడుగా
దరువగబర్వతంబు వడిదాటిని నీటమునుంగనంతటన్
హరియనిమ్రొక్కగూర్మమై యాపదబాపినతండ్రి ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుమువేగ శ్రీపతీ. 9

చ. ధరణికటాసనంబు క్రియదారమనోరథసిద్ధిగోరి యు
త్తరుగిరిగోవరాదిఖగ తాపసులంతరితోడజుట్టగా
మొరవిడహేమనేత్రునటు మోదినమేటివరాహ ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుమువేగ శ్రీపతీ. 10

చ. ఉరువడినుక్కుకంబమునను జ్వలదంష్ట్రినఖోద్గతప్రభా
స్ఫురితగతిన్ హిరణ్యకశిపున్ వధియించితదాత్మసంభవున్
గరమనురాగయుక్తముగ గాచినయుగ్ర నృసింహ ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుమువేగ శ్రీపతీ. 11

చ. సురపతిమేలుగోరి బలిసొంపణగింపను వామనుండవై
ధరణిపదత్రయంబతని దానముగోరినదారబోయగా
నరయుగమూడులోకముల నాక్రమమొందినదేవ ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుమువేగ శ్రీపతీ. 1

చ. పరమమహీసురుండవై భార్గవరాముడనంబ్రసిద్ధిగా
నిరువదియొక్కమారు ధరణీశులద్రుంచి తదీయశోణితం
బరుదుగబైత్రుతర్పణం నాతరిజేయుదువయ్య ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుమువేగ శ్రీపతీ.

చ. తరుణికులేశుడా దశరథప్రభుసూనుడవై మహీసుతం
బరిణయమంది రావణునిభంగమొనర్చి విభీషణాదులం

బరమకృపారసంబునను బాలనజేసినరామద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ. 14

చ. మురిపెముతోడ రోహిణికి ముద్దుకుమారుడవై జనించిభూ
భరమగుదుష్టులందు నిమిభాసురలీల హలాయుధంబునీ
కరమునదాల్చి భక్తులనుగాచిన శ్రీబలరామద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ. 15

చ. సురుచిరమూర్తివై భువనసుందరియైన సుభద్రితోఁగనుఁ
నిరతముముచ్చటింపగల నేర్పుగలట్టి మహానుభావయో
సురమునిపూజితాంఘ్రియుగశోభిత నీలగిరీశద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ. 16

చ. నిరతముమాకెసద్గతివినీడవుతోడువు తండ్రిదాతవుఁ
గురుడవుప్రాపుకర్తవని కోరిభజించెదనెల్లవేళలన్
మరువకనాదువిన్నపము మానసమందుననిల్పిద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ. 17

చ. హరియనిరెండువర్ణముల నాత్మనునమ్మితలంచువారికిఁ
దరుగును బాపసంఘములు దానవమర్దన నీదునామముఁ
గరమునుతింపమానులకు కంజజుకైనవశంబెద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ. 18

చ. మురియుచు రామకృష్ణయని ముద్దుగచిల్కను బెంచిపిల్వగా
సరసిజనేత్రవారలకు సద్గతులీయవెనీపదాబ్జముల్
నిరతముగొల్చునాయెడల నిర్దయబూనుటదేమిద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ. 19

చ. ధరనతిక్రూరచిత్తుడయి ధర్మముమాని పరాంగనారతిఁ
మరిగియజామిళుండు తుదిమాధవనీదగునామయుక్తుడా

వరసుతుబిల్వసత్వదనివాసుని జేసితివయ్యద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ.

చ. పురజనులెల్లనద్భుతము పొందగబూతనచన్నులందుదా
గరళముబూనియెత్తుకొని గారవమిమిఅగ క్షీరమియ్యగా
ధరణియొనర్చుకృత్యమును దద్దయునెంచిహరించు ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ.

చ. కరిమొరపెట్టగా శబరికమ్మనిరేగుఫలంబులియ్యగా
శరణనగావిభీషణుడు సన్నుతిజేయగనాకుచేలుడున్
వరకరుణాకటాక్షమున వారలగాంచితివీవెద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ.

చ. వెరచిదరిద్రదోషమున వేదననొందు కుచేలుడార్తుడై
వరపృథుకంబులియ్యగను వంచననేయకబాల్యస్నేహమున్
నెరపిధనాదులిచ్చివడినేలితి వీవెగదయ్య ద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ.

చ. దురితమనోరథంబునను దుర్నయులై ధృతరాష్ట్రసూనులా
పరమగుణానువర్తులగు పాండుతనూజులగష్టపెట్టగా
నరహరినీవెదిక్కనుచు నమ్మినగాచితివీవెద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ.

చ. తరుమృగకీటకాది జనితంబుల కన్న మహత్తరంబునౌ
నరజననంబునొంది మిమునమ్మిభజింపకమూఢచిత్తుడై
పరగితిగానమీస్మరణ భావముచేకొననై తిద్వారకా
తిరుపతివేంకటాచలపతీ నను బ్రోవుము వేగ శ్రీపతీ.

చ. శరనిధిగట్టుపృక్షచర సైన్యముతోడనుదాటిలంకపై
కురికిమహాప్రతాపమున నున్నతకీర్తులు విస్తరిల్లగా

దురమునరావణాదులను దుచ్ఛలజంపినరామద్వారకా
తిరుపతివేంకటాచలపతీ ననుబ్రోవుమువేగశ్రీపతీ 26

---

# అ మ ర నా రా య ణ శ త క ము.

:0:

సీ. శ్రీరామశ్రీరామ శ్రీరామయనుచు నే
వేళనుమదిలోను వేడుకున్న
గోపాలగోపాల గోపాలయనుచును
చిత్తంబునీమీద జేర్చియున్న
కమలాక్షకమలాక్ష కమలాక్షయనుచును
చూడ్కులునీమూర్తిజూచుచున్న
పరమాత్మపరమాత్మ పరమాత్మయనుచును
పట్టుగానిన్నుచేపట్టియున్న
తల్లిదండ్రియుదాతయు దైవమనుచు
నమ్మినాడనుదీనులసొమ్మునీవె
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరకకైవరపురవిహార.

సీ. ఆనందచిత్తుడై యఖిలేశుచరితంబు
లింపుగాదానాలకింపుచుండు
మాధవపదపద్మ మంజులస్తవములు
నోరారనెవ్వడు నుడువుచుండు
విష్ణుమంగళదివ్య విగ్రహమెప్పుడు
సేవించునతడె నిచ్చిందుడరయ
వాసుదేవునిశుభ వైభవమెప్పుడు
వినుతించునతడెసద్ద్విజవరుండు

పావనులువీరువీరు పైపరమకృపను
రక్షణముసేయుశ్రీకృష్ణరక్షకుండు
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక కై వరపురవిహార. 2

సీ. ఎంతకాలంబైన యెరుకలేకనుజీవి
చచ్చిపుట్టుచునుండు సహజమిదియు
జన్మమరణములెన్నో జాతులెన్నోయనో
తల్లిదండ్రులెందరో తనువులెన్నో
యిపుడుధరలోన యిటువంటిమానవ
దేహముల్ నిర్మించె దేవుడరయ
మునుపటివిధమునమూర్ఖులైచెడకను
శ్రీహరినామముల్ చెప్పకొనుచు
పట్టువదలక పరమందెదృష్టియుంచి
భవభయంబులు లేనిసంపదచరింతు
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక కైవరపురవిహార. 3

సీ. శృంగారమైనట్టి బంగారుభామల
మన్నుగాజూచిన మానధనుడు
యిందిృయంబులకెల్లనింపైనవస్తువుల్
చంపివేసినవాడుసజ్జనుండు
మాయలన్నిటిగురు మాతృకదగిలించి
పారదోలినవాడు పరమగురుడు
చలనమందికలోని చపలమంతయుదీసి

తలపులన్నియుదిగనాడి తనువుమరచి
తన్నుదెలిచినవాడు దాతత్వయోగి
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక కైవరపురవిహార 4

సీ. విప్రులమనిచాల విర్రవీగుదురింతె
బ్రహ్మనుజేరితా ప్రబలలేరు
కూలీలరీతిని కులవృత్తిపోనీక
మైలకోకలువిప్పి మడుగుజేసి
స్నానసంధ్యాదులు సల్పునూత్రిమెకాని
అన్యథాకాపేక్ష లణచలేరు
పరులదగ్గిరజేరి పలుకుదురునీతి
తమయందు దుర్నీతితప్పకుండు
విప్రులైతెయేల విడువరువిషయముల్
విష్ణునెఱుగలేక భ్రష్టులైరి
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక కైవరపురవిహార. 5

సీ. ఏజాతివాడైన యేనీతివాడైన
హరిభక్తిగలుగువా డగ్రజుండు
పూరకొండెడివేళ నుద్యోగములవేళ
నిద్రబోయ్యెవేళభద్రముగను
మనసుచెదరనీక మదిమురాంతకుమీద
భక్తినిలిపినవాడు భాగవతుడు
ఆకొన్నవేళను యతితృప్తివేళను
సమబుద్ధిగలిగిన సహజయోగి

భక్తజనములువీరికి భయములేక
చేరియుందురు శ్రీహరిపురమునందు
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక కైవరపురవిహార

సీ. ఇహజాలములురోసి యింటివారినిబాసి
యంత్యకాలము వేగ నాత్మదెలసి
తాపరంజ్యోతిని తప్పకగురిజూచి
తనువువిసర్జించి తావువెడలి
పశ్చిమవాకిట పరుగెత్తి వేవేగ
పట్టాభిరామునిపట్టణంబు
జేరి శ్రీరాములసేవించి నెలమితో
భోగంబులన్నియు బొందుచుండు
అతడెపుణ్యుండు ధన్యుండు నచలితుండు
అతడుభక్తుండుముక్తుండు నగ్రజుండు
అమరనారాయణాచ్యుతా హరిముకుంద
దురితదూరక కైవరపురవిహార.

సీ. నిన్ను నేమదిలోన నిజముగాస్మరియింప
వాల్మీకమునిగాను వారిజాక్ష
చెలికానిరీతిని చేరిసేవించుటకల
నారదుడగానయపరిమేయ
శయనించువేళమీ చరణమొత్తుటకును
పన్నగేంద్రుడగాను పద్మనాభ
భుజములనిడుకొని భులిగమించుటకును
పక్షిరాజునుగాను పరమపురుష

చాలనమ్మితినీపాద సరసిజములు
వేరుశాయకుయికనన్ను విశ్వరూప
అమరనారాయణాచ్యుతా హరిముకుంద
దురితదూరక కైపరపురవిహార. 8

సీ. రావణతమ్ముని రాజుజేసినయట్లు
అర్జునతిప్రేమ నరసినట్లు
ఆంజనేయునిమీద నతిప్రేమయున్నట్లు
ద్రౌపతి కష్టముల్బాపినట్లు
గోపకాంతలకునీకూర్మి జూపినయట్లు
కరిమొరవిని కృపగాచినట్లు
అమరేంద్రసుతునకు యాత్మదెల్పినయట్లు
ప్రహ్లాదునకును బ్రాపయినయట్లు
యట్లుబ్రిత్యతుమైరమ్మ యెవరుదిక్కు
భక్తజనపోష వైకుంఠ పరమపురుష
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక కైవరపురవిహార.

సీ. సకలలోకాధీశ సజ్జనమందార
తారకాచలవాస వారిజాక్ష
మూలమంత్రాధార మునిజనపరిపాల
సురమునిస్తోత్ర భాసురచరిత్ర
కందర్పజనకనీ పొందుగానకయెంతో
భాగవతులు మోహబద్ధులైరి
నేనెంతవాడను నిజముగాదెలియను
నిండుచూపులుజూడు నిర్మలాత్మ

రాత్రిపగలును శ్రీరామరామయనుచు
భజనజేసెనభవముల బాపజూచు
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరకకై వరపురవిహార. 10

సీ. వేదాంతవేద్య శ్రీవేణుగానవినోద
కరుణాపయోనిధి కంసహరణ
గరుడతురంగసంగరభీమ బలభద్ర
మార సహస్రసమాన తేజ
సరసగోవింద నళినాక్ష మాధవ
మాగధఖండన మధురవచన
సరసిజోదరనిత్య సత్యసంభాషణ
దేవకీనందన దేవదేవ
నిలచియుండుము నాయాత్మనిత్యముగను
ఆలకించకనామాట నాదిదేవ
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరకకై వరపురవిహార. 11

సీ. సరసిజాననలతో సరసంబులాడను
మదిదలంపుచునన్ను మరచినావొ
భామామణులమాన భంగంబు చేయను
మదిదలంపుచునన్ను మరచినావొ
గొల్లయిండ్లకో పాలుచల్లారగించను
మదిదలంపుచునన్ను మరచినావొ
పదియారువేల స్త్రీలతోగూడను
మదిదలంపుచునన్ను మరచినావొ

చింతలేకనుగొలువ నత్యంతభక్తి
పంతమేటికినామది చింతదీర్పు
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరకకైవరపురవిహార 12

సీ. నీపేరిటనుశిలల్నిర్మించి ధరలోన
పూజలుసేయింతు పుణ్యులకును
నీనామకీర్తనల్ నిర్మలమదితోడ
పఠనగల్గినవారి పాటిగాను
పగనైనవగనైన ప్రాణభీతినయిన
ఆత్మలోదలచుట యధికబుద్ధి
ధనధాన్యపశుభృత్య దారాదివస్తువుల్
నీకర్పితముజేతు నిత్యముగను
శరణుశరణయ్య శ్రితభయహరణనీకు
నాత్మధ్యానింతు నీకీర్తినను దినంబు
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరకకైవరపురవిహార. 13

సీ. వ్రతనీమములుజేసి వెతలుజెందుటెకాని
అందువల్లనుయేమి యాశలేదు
మాతృపితాచార మమతలింతేకాని
తెలియదించుకమైన దీనిలోన
మడుగునీళ్ళనుమున్గి మడుగాయెనందురు
కామాంధకారంబు గరగిపోదు
ఇంటిదైవంబును యిలలోనదైవంబు
వేరుగాజూతురు వెఱ్ఱిమతులు

ఇన్ని అగచాట్లుపడనేల సన్నివిడిచి
యోగదృష్టినిహరిజూడ నాగతంబు
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక కైవరపురవిహార.

సీ. తామసంబడగించి తలపుకొట్టకపొంచి
లోచూపుగురిజూచి లోతుదెలిసి
పాతాళగుహజొచ్చి ఫణిపై కిలంఘించి
యసహాయశూరుడై యచటనున్న
ఆర్గురురాజుల నాశ్రమంబులుచూచి
ముందటచనుబాట మూలమెరిగి
మూడేకమైయున్న ముక్తిద్వారముచూపి
పండువెన్నెలపట్టణమందుజేరి
రామరాజును బొడగన్నరాజయోగి
పునఃజన్మాదులెత్తని పుణ్యజనుడు
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక కైవరపురవిహార.

సీ. రామనీపాదపరాగ ప్రభావంబు
లోకమాతకు నహల్యకును దెలుసు
నిజముగనీహస్తభుజ మహిమంతయు
శంఖచక్రాదిశస్త్రము లెఱుంగు
మాధవరామ నీమస్తకమహిమయు
హీరమాణిక్యకోటీర మెఱుగు
పట్టాభిరామ నీబలపరాక్రమములు
కలుషాత్ముడగు దశకంఠుడెఱుగు

సర్వసాక్షిరూపసకలాంగములమహి
మెఱుగుఁబోలు పన్నగేంద్రునకును
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక కైవరపురవిహార. 16

సీ. ఇతరముమానినే నతిభక్తితోనుంటి
కమలాక్ష నామాటకల్లగాదు
తలపునీమీఁదను తప్పకున్నదినుమీ
కమలాక్ష నామాటకల్లగాదు
నిమిషమాత్రంబైన నిన్నెడబాయను
కమలాక్ష నామాటకల్లగాదు
నన్నువాదములన్ని తనుదానువీడెను
కమలాక్ష నామాటకల్లగాదు
నీకుదెలుసును భక్తుల నిజగుణంబు
కమటమానను లేయగరీకలియుగమున
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరక కైవర పురవిహార 17

సీ. కరగకరగవచ్చు కనకంబునకువన్నె
తరచతరచగవచ్చు దధికివెన్న
చూడచూడగ నాత్మజ్యోతి తాచొప్పడు
వినగవినగముక్తి విధముగనును
నడువనడువగట్ట నడిమిబాటనుజేరు
ననగననగనుమాట లమృతమౌను
చాయచాయగపూజ చక్కగావచ్చును
తినగతినగచేదు తియ్యనౌను

నితరములులేక నీయోగతత్వమెరిగి
మోహశోకము విడిచినముక్తుడగును
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరకకై వరపురవిహార. 1?

సీ. రఘునాథరవివంశ రాజరాజాగ్రణి
దయచూడరావేగ దనుజవైరి
దీనరక్షకనేను దినదినమునుచాల
భక్తితోనీనామ భజనచేతు
ఉరగేంద్రశయనన నుడుగక నిత్యము
జేసినపనులు నీసేవగాదె
దానవత్సలనేను ధరనుమీదనిడిన పా
దంబులునీకు ప్రదక్షిణములు
ఆపదోద్ధారకానంద హరిముకుంద
వేదవేద్యనృసింహసర్వేశకృష్ణ
అమరనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరకకై వరపురవిహార 1

సీ. ఎచ్చోటనీమూర్తి మచ్చికకల్గిన
నచ్చోటనిన్నాత్మ మెచ్చుచూతు
ఎచ్చోటనైన నీమెచ్చుశ్రీదళముల
పురుషోత్తమానిన్ను పూజసేతు
యెచ్చోటనుదకంబు లెచ్చటజూచిన
నచ్చోటపూజలు హరికిజేతు
యెచ్చోటఫలముల నిచ్చగాజూచిన
నచ్చోట హరికర్పణంబుచేతు

నిన్ను మరువను క్షణమైననీరజాక్ష
వేదవేద్యముకుంద గోవిందనృహరి
అసురనారాయణాచ్యుత హరిముకుంద
దురితదూరకకై వరపురవిహార. 20

---

# భద్రాద్రి రామచంద్ర శతకము.

---:o:---

సీ. శ్రీమైథిలీసుహృజ్జీవన రహచిత్ర
తతఘోర దురితలతాలవిత్ర
నిరుపమ మేచక నీరధనిభగాత్ర
సదమలభూరి యశశ్చరిత్ర
యనుపమమునిమానసా రామవర్గచైత్ర
సందీప్తగాంగేయ సదృశనేత్ర
సంతతానర్ఘ్య విస్తారక్షమాగోత్ర
పరివిమలకరశతపత్రనేత్ర
గీ. యద్రిజాధీశమిత్ర సురారిజైత్ర
ఖగకులాధీశపత్ర జగత్పవిత్ర
యమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రి రామచంద్ర.
సీ. కంజాసనుండాదిగా నాకపురవాసు
లంచితభక్తి నుతించగాను
రవివంశదుగ్ధవారాశి శశాంకుడా
దశరథేశ్వరునకు తనయుడగుచు

రమణీయకోసల రాజపుత్రిసుగర్భ
శుక్తిమౌక్తికమన సొబగుదనరి
పొలుపొందదిక్తటంబులు చెన్నువహియింపసకల
జనులకు మహోత్సవమునింప

గీ. నెల్లపరులకు కడుభీతి వెల్లివిరియ
వెగడునట్టి భవచ్చర్యలొగిరచింతు
నమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర.

సీ. మాన్యమైక్షేత్రాగ్రగణ్యమైశాత్రవ
దైన్యమైశైల రాజన్యమగుచు
ధన్యమైపెక్కు లావణ్యమై భద్రసౌ
జన్యమైధాత్రి కనన్యమగుచు
గుణ్యమైదితిజాల కన్యమైకల్మష
శూన్యమైయసమ ప్రవీణ్యమగుచు
ముఖ్యమైభోగాతి సౌఖ్యమైరిపులక
శక్యమైయాశ్రిత సఖ్యమగుచు

గీ. సంతతోత్సవములను దురంతమగుచు
వలరుభవదీయ నిలయమేనభినుతింతు
నమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర.

సీ. సారమైమంగళాధారమై సత్కృపా
సారమౌ నీగుణాదారపటిమ
చిత్రమైపరమపవిత్రమై జగదభి
స్తోత్రమౌ నీదుచరిత్రరచన

యందమైలోచనానందమై పరిమళ
బృందమానీగాత్ర సుందరతయు
భవ్యమైతాపసద్రవ్యమై బహుళతర
శ్రావ్యమానీసూక్తు లవ్యయముగ
గీ. నగుచు చెన్నొందిసద్యుతు లమరుచున్న
నీవిలాసంబువర్ణించ నేరరెవరు
నమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 4

సీ. అసమానసత్కృపా రసమొల్కుచూపు
మోదకరంబగు నీదురూపు
నీదివ్యచరితంబు నిఖిలాఘములబాపు
మధువయిని నీదునామంబుతీపు
దీనులకెల్లనెంతయిన నీవేదాపు
కమలాక్షునాదు నేరములసైపు
మౌనిసంఘమునకు మహినినీవేకాపు
బరిమళార్చితవిశత్రు వరులరేపు
గీ. ప్రీతికరముగనిను గొల్తు రేపుమాపు
దాసుడనునేడు నాకొక్క దారిజూపు
నమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 5

సీ. మాననీయామాన మార్తాండకులదీప
సరసమాధుర్య వచఃకలాప
దైతేయనిచయ విధ్వంసకశరచాప

కమనీయ శతశతకందర్పసమరూప
భంజితసద్భక్తపఙ్క్తిపాప
దీనవిశ్వంభరా దేవతానిక్షేప
కరమర్థినన్నేలు కరుణదోవ
గీ. ప్రాపునీవని నమ్మితి తేపతేప
రయమునినుబాసినే గొంచమయిన సైప
నమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 6
సీ. భారమానను బ్రోవ నేరమా నీప్రాపు
జేరమా రవికుల శ్రేష్ఠవినుము
దూరమా యింతనిస్సారమా యిటులయితే
దూరమా నను కృపతోడగనుము
కూరిమా చూడగంభీరమా మదినిన్నె
గోరమా నన్యుల గేరుమనుము
సారమా యిదియె విస్తారమా నీసాటి
వారమా నెనరిదె వచ్చెననుము
గీ. కీర్తిగల్గును సంభ్రమస్ఫూర్తిగల్గు
నీకునాకును యిదె హద్దు నిజముగద్దు
యమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 7
సీ. శరణయ్య నిర్జరస్తవ సత్యచారిత్ర
శరణయ్య దివ్య వారిరుహనేత్ర
శరణయ్య మేచక జలదసన్నిభగాత్ర
శరణయ్య పార్వతీవరసుమిత్ర

శరణయ్య జనకభూవర జాతసుకళత్ర
శరణయ్య దేవారిసైన్యజైత్ర
శరణయ్య మౌని హృజ్జలజాతదళమిత్ర
శరణయ్య నీకిదే గరుడపత్ర
గీ. శరణువంశపవిత్ర పోషణసుపత్ర
శరణుశరణిదెయిదె నాదుశరణుగొనుము
యమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 8

సీ. వరసువర్ణంబుచే వలనగునీయిల్లు
నురుగుణాకరము నీకరమువిల్లు
పరమకృపారసాస్పద చూపునీచూపు
లలితక్షీణంబు నీలక్షణంబు
సంతతలోకహర్షంబు నీచరితంబు
ఖేదవిమోచన నీదురచన
నయధర్మవిస్ఫుటనంబు నీనటనంబు
భవతరణంబు నీప్రాభవంబు
గీ. లహహానీచిత్రకరము లెంతనిగణింతె
నార్యులనినంత నెన్నితినన్ననిన్ను
నమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 9

సీ. కల్మషహరమైన గౌతమిపాడగంటి
లలిమీరు భద్రశైలముగంటి
గురుతరహాటక గోపురంబునుగంటి
కోరినమీర కుమారుగంటి

కల్యాణభరిత విగ్రహుడగునినుగంటి
పొందుగాసీతమ్మ నందుగంటి
మోదంబుతో సుమిత్రాదేవి సుతుగంటి
పొల్పుసీ పరిచారకులనుగంటి
గీ. ప్రవిమలంబగు నీమహోత్సవముగంటి
కౌతుకంబబ్బెకన్నుల కరువుదీర
నమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 10
సీ. నీనామమంత్రంబు నిశ్చలభక్తిని పొలు
పొందనెపుడు శంభుడుపఠించు
నీనామకీర్తనల్ మానితానందుడై
నారదుండెడపక కోరిపాడు
నీనామమాత్రశుద్ధిగా నమ్మియొకబోయ
చెలువొప్పధాత్రి రాశికినివచ్చె
నీనామమంత్రమె నిరతంబుమదిని సు
స్థిరముగ నమ్మిసంస్మరణసేయు
గీ. తెలివినాబోటి ఖలునకుతేటపడక
నీదునామంబు నొడువంగ నేరరహహ
యమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 11
సీ. వరఫలసమ్మిశ్రితరువులు పెక్కైన
నమరభూజంబుతో సమతయౌనె
సంతప్తకాంచన సహితమహామణులయిన
లలితచింతామణి తులితమగునె

క్రేపులతోఁగూడి గెరలు ధేనువులయిన
కామధేనువతోఁటి కల్పమగునె
విస్త్రుతమై మహావేగమానములయిన
వాసివియద్వాహినీసమంబె
గీ. యన్యసురలెందరైన సత్యంబుగాను
సారసాప్తమలేశ నీసాటియగునె
యమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 12
సీ. సుతుడంచు దశరథక్షితినాథుడు దలంచు
మిత్రుడంచు సురవిపుత్రుడెంచు
పౌత్రుడవనినీదు మాతృతండ్రిగణించు
జననాథుడనినృప సంఘమెంచు
జామాతవనియల జనకుండుయోచించు
బంధుడవనిబంధు పఙ్క్తియెంచు
సామాన్యుడనియన్య జనమెల్లవచియింతు
రతిబలుండనికవుల్ మతిదలంతు
గీ. రింతియేకాని పరమాత్మడీతడంచు
నెరుగలేరైరి వీరెల్లనెలమిగాను
యమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 13
సీ. పాదంబులుండిన ఫలమునీసుక్షేత్ర
ములకునేగగగానిముక్తిరాదు
వలనొప్పకరములు గలిగినఫలము ని
న్బూజసేయకగాని పోదుఖలము

గరిమతో వీనులు గల్గినఫలమునీ
కథలాలకింపగ గలదెబుద్ధి
పొలుపొంద రసనంబుగలిగిన ఫలము నీ
నామంబునొడువక నయము లేదు
గీ. గానయాచిన్నెలన్ని యక్కజముగాను
గలుగజేసిన మోక్షంబుగానవచ్చు
నమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 14

సీ. ధామమైనుత సురస్తోమమైసంగ్రామ
భీమమై లోకాభిరామమగుచు
సారమైపొందు రాకారమైయాశ్రితా
ధారమైసంతతో దారమగుచు
నిత్యమైగతపాప కృత్యమైసముచిత
భృత్యమై మహనీయసత్యమగుచు
నాదియైనిస్వనామోదియై భవ్యసం
వేదియైభద్రసంపాదియగుచు
గీ. ప్రౌఢిగాంచిన నీదివ్యపాంచజన్య
మెపుడుమామక కోర్కులనిచ్చుగాత
యమలగుణసాంద్ర సూర్యవంశాబ్ధిచంద్ర
రాజరాజేంద్రభద్రాద్రిరామచంద్ర. 15

# మానసబోధశతకము.

—:o:—

ఉ. శ్రీరమణీమణీహృదయ సేవితముల్ నవఫుల్లహల్లక
శ్రీరమణీయసుందర విశేషవిలాసము లబ్జసంభవో
దారకిరీటరత్నలలితద్యుతిపూర్ణము లభ్రగాపగా
సారతరంబులందు మనసా హరిపాదములాశ్రయింపుమా. 1

ఉ. దండిగ చట్టురాతిని యథావిధిసంగనగానొనర్చె ను
ద్దండతకొండచిల్వను ముదంబునజేసెను దివ్యదేహిగా
బండితులైనవారినెడ బాయక బ్రహ్మపదంబుజేర్చె నీ
చండితనంబుమాని మనసా హరిపాదములాశ్రయింపుమా. 2

చ. సనకసనందనాదిముని సత్తములుత్తమ భక్తియుక్తిసా
ధనముననంబుజాక్షుని పదంబులసేవ యొనర్చిధన్యులై
మనుటయెరింగియింక కోరమాలినవారలవేడనేల నీ
వనవరతానురక్తి మనసా హరిపాదములాశ్రయింపుమా. 3

ఉ. సారములేనిసంసరణ సాగరమీదగలేకజాల నే
సారుడుగర్మబంధముల జచ్చుచుబుట్టుచు సారెసారెకున్
దారుణకాలకింకరుల దండనకోరువలేవుగాన వి
స్తారసుఖంబుగల్గు మనసా హరిపాదములాశ్రయింపుమా. 4

ఉ. పెట్టనికోటఘోరభవ భీరులకున్ బరమార్థదేహికిన్
గట్టనియిల్లు పూర్వకృతకర్మలతల్ తెగగోసివేయ జే
పట్టనివాలువేరు యొకపట్టుతలంపగమోక్షసంపదల్
యట్టికొనంగవచ్చు మనసా హరిపాదములాశ్రయింపుమా. 5

చ. అమితజపోపవాస నిగమాగమసంస్తుతికంటె నిత్యసం
యమనియమాదియోగ విహితాచరణంబులకంటె సాధుసం

మారుహారిందలంప నసమానశుభంబు ఘటిల్లుగానవే
సారకనీవునేడు మనసాహరిపాదములాశ్రయింపుమా. 18

ఉ. కోతులనేలినాడవని కోవిదులెన్నగవింటినేనయో
కోతిగనుంటి నన్నటులగొబ్బున సేవకుగానొనర్చి సం
ప్రీతిగబ్రోవుమంటి నిరుపేదలబాత్రిగసాకుటెల్ల
బ్రఖ్యాతియుగాదెయంచు మనసాహరిపాదములాశ్రయింపుమా. 19

చ. ఉతుతకుగల్గెముక్తిపద మూనరవల్లికిసౌఖ్యమబ్బె నె
క్కుడుగతిపక్షికొప్పె ధరకోమలిరూపము జెందరాయిమేల్
వడసెనుపాదుకుండు భవబాధలబాసెవిషాదుడా మహో
జడధిశయానునాజ్ఞ మనసాహరిపాదములాశ్రయింపుమా. 20

ఉ. గరుడునిమూపునన్నిలిచిఖడ్గశరాసన శంఖచక్రముల్
కరములనుల్లసిల్ల మృదుకాంచనచేలము కాంతులీనసుం
దరమణిభూషణావళులు దారకిరీటముదాల్చివచ్చినీ
సరసనునిల్చిబ్రోచి మనసాహరిపాదములాశ్రయింపుమా. 21

చ. పొక్కిటితమ్మిలోనలువ బుట్టగనాతనిఫాలదేశమం
దెక్కుడుకంటివేల్పు జనియింపగజేసి యుతంఢుదాల్పవెం
పెక్కినమెట్లుదమ్మిచెదవేటి వధూటినిగన్న మేటినీ
యక్కరలెల్లదీర్చు మనసాహరిపాదములాశ్రయింపుమా. 22

చ. హరచతురాస్యషణ్ముఖ సహస్రముఖేభముఖాదిదేవతా
వరులునమస్తవేదములు వర్ణనజేయగలేరు నిన్నయో
నరుడనుజ్ఞానహీనుడను నాథుడనెన్నగ నాకుశక్యమే
శరధిశయానయంచు మనసాహరిపాదములాశ్రయింపుమా. 23

ఉ. పాపమువేటజేరు భవబాధలుగొందుల దూరుగోరుసం
తాపదవాగ్నులారు విపదంబుధులింకగబారుమోక్షము

ద్దీపితవృత్తిదేరు మనదీనతమాన్పెడివారులేరు నీ
యాపదలెల్లదీరు మనసాహరిపాదములాశ్రయింపుమా. 24

ఉ. తొలిచదువుల్ వడింగొనుచుఁ దోయధిఁజొచ్చి సోమకాసురుఁ
బలిమిగమీనరూపమున బట్టివధించిరయంబునన్ శ్రుతుల్
నలువకొసంగిలోకముల నర్మిలిఁబ్రోచినమత్స్యమూర్తిసొం
పలరగనిన్నుఁబ్రోచు మనసాహరిపాదములాశ్రయింపుమా. 25

చ. కులగిరికవ్వమంబు నిధికుంభము పాములరేనుత్రాడుగా
దలపడిదేవదానవులు తత్పరతన్ మధియింపభారము
గ్గలమునఁగ్రుంకుశైలము సుఖస్థితిదాల్చిన కూర్మమూర్తి ని
శ్చలముగనిన్నుఁబ్రోచు మనసాహరిపాదములాశ్రయింపుమా. 26

ఉ. పుత్తడికంటిరక్కసుడు బొత్తిగనీధర్మజాపచుట్టి న
ల్లెత్తుకనారసాతలికి నేగగవానివరాహరూపమై
కుత్తుకద్రుంచిభూతలము గొమ్మునదాల్చినదంష్ట్రిసత్కృపా
యత్తతనిన్నుఁబ్రోచు మనసాహరిపాదములాశ్రయింపుమా. 27

ఉ. సర్వమయుండువిష్ణువని చాటినయాపసిబాలుగావగా
శర్వముఖామరుల్పొగడ స్తంభమునన్ బ్రభవించినిష్ఠురా
ఖర్వనఖాళిదానవునిగర్భముజీరిన శ్రీనృసింహుడే
సర్వఫలంబులిచ్చు మననాహరిపాదములాశ్రయింపుమా. 28

చ. బలిబలిమిన్ దివౌకసులబాంగదోలి జగంబులెల్లరా
జిలువటువేషమూని బలిజేరిపదత్రయభూమిదానముల్
వలనుగవేడితత్పదవి వజ్రికొసంగిఁ యాత్రివిక్రముం
డలయకనిన్నుఁబ్రోచు మనసాహరిపాదములాశ్రయింపుమా. 29

చ. ఇరువదియొక్కకయ్యముల నిట్టులగంటకులైనరాజులం
దరలగగూల్చి తద్రుధిరధారలనేరు లొనర్చిపైతృకా

చరణముసల్పి శాశ్వతయశస్కరుడౌ భృగురామమూర్తి
నిన్నరసికృపాప్తిఁబ్రోచు మనసాహరిపాదములాశ్రయింపుమా. 30

చ. రవికులమందుబుట్టి బలురక్కసిదాటకగొట్టిమౌనిరా
ట్సవనముచక్కబెట్టి గురుసమ్మతిగాననుముటివార్థిలో
వ్జవమునగట్టి రావణుధరంబడగొట్టిన రామమూర్తిని
న్నవిరళవీరనేలు మనసాహరిపాదములాశ్రయింపుమా. 31

చ. అలవసుదేవరోహిణుల కమృతలీలజనించిమించిచే
హలముసలాస్త్రశస్త్రముఖారాయుధముల్ ధరియించిముష్టికా
దులవధియించి భూభరముదాల్చిన శ్రీబలరామమూర్తితా
నలలితలీలనేలు మనసాహరిపాదములాశ్రయింపుమా. 32

చ. ఘనతరబోధలందిపురకాంతకు నిష్టలువాన్పిపార్వతీ
శునకుశతాంగశస్త్రశర శూలధనుఃప్రముఖోగ్రదివ్యసా
ధనములొసంగితత్రిపుర దైత్యులదున్చిన బౌద్ధమూర్తిని
న్ననవరతంబుబోధిచు మనసాహరిపాదములాశ్రయింపుమా. 33

ఉ. మిత్రులమంచుదేవతల నేయనుఖస్థితి నిల్పియుండగా
శత్రులమంచురాక్షసులు సంగరభూములయందుజావగా
శత్రులుమిత్రులుంగలరె సర్వసముండురగేంద్రశాయిత
చ్చాత్రునిజేయ మనసాహరిపాదములాశ్రయింపుమా. 34

చ. తెలియకపాపకర్మముల దెంపునజేసితిమందబుద్ధినే
మెలగితిగాలుదేమిదిమిమేల మొనర్చునొయంచుభీతిచే
నిలచి చితినాకుదిక్కకను నీవెమరెవ్వరులేరుబ్రోవవే
జలనిధిశాయియంచు మనసాహరిపాదములాశ్రయింపుమా. 35

# కుమారశతకము.

———:o:———

క. సంతసమున బియ్యములో
బంతులుగారొగి నమశ్శివాయయనుచు న
త్యంతమువ్రాయగ నుపదే
శింతురుపిదపదమయొద్ద జేర్చికుమారా. 1

క. పుస్తకముల నెప్పుడుకొని
విస్తారమునలుగనీక వెండిపయిడిమేల్
వస్తువులవేడ్కవాడెడి
మోస్తరువాడికొనవలయు ముద్దుకుమారా. 2

క. బడికేగెడునప్పుడునీ
యడుగులులెక్కించుచుబరుల నరయుచుజన కె
ప్పుడునీపాఠంబులనే
వడిజదువుకొనుచుజనంగ వలయుకుమారా. 3

క. పాటుపడిచదువుకొనినీ
పాఠంబులనొప్పగించువఱకునుమఱి యే
యాటలదెసబోకుండిన
బాటిగగురువునకుమెచ్చు వచ్చుగుమారా. 4

క. తక్కువతరగతికంటెను
నెక్కువనేజదివితినని యెంచుచునెడలో
నిక్కకమక్కువవారికి
జక్కగబాఠములుజెప్ప జనుముకుమారా. 5

క. దబ్బరలాడుచుబడిలో
బొబ్బలువెట్టుచును బాఠములుచదువక త

బ్బిబ్బైననుబంతులచే
దెబ్బలుగలుగుజుమమెలగు తెలివిగుమారా. 6

క. ఎప్పుడువిద్యాసక్తిని
దప్పకయుండవలెగాని తఱుచాటలలో
జొప్పడియుండకుగొప్పని
యెప్పుడుచుట్టలనుగాల్ప కెగ్గుకుమారా. 7

క. హృద్యంబుగమునుజదివిన
పద్యంబులనొకటివిసగవలె జదువుమనన్
సద్యస్కాలంబున నన
వద్యంబుగజదువుసుద్దు వచ్చుకుమారా. 8

క. సరివారితోడనైనం
గరమధికులతోడనైన గలసిమెలసితా
జరియించుటమేలగుగా
కరయనితరుగూడగూడ దండ్రుకుమారా. 9

క. పెద్దలుసెప్పినపనులను
ముద్దుగజేయుచునుదల్లి మొదలగువారల్
తద్దయుసంతోషింపగ
నిద్దపుభయభక్తులలర నెగడుకుమారా. 10

క. ఒరులయెడద్వేషబుద్ధిని
భరియింపకపరుషములను బలుకకప్రీతిం
జరియించుచుండుదీనను
గరమధికపుగౌరవంబు గలుగుకుమారా. 11

క. పదిగంటలైన నొజ్జల
ముదలంగొనియింటికరిగి మునుకొనిచల్దుల్

గుడిచినతోడనెపాఠము
జదువుకొనుచుబడికిబోవ జనునుగుమారా. 12

క. ఒకరినిగొట్టకదిట్టక
యొకరినిచేబడకనిజ జనోత్కరమునునో
వికలంబునొందచేయక
ప్రకటితమగురీతినడువు బాగుకుమారా. 13

క. చీమలులోనగుజీవ
స్తోమంబులుకాళ్లక్రింద ద్రొక్కుడుబడునే
మోమహింసని కనినడువుము
కామించుచుద్రొక్కజనదు కానగుమారా. 14

క. శత్రువుల నైననిందకు
బాత్రులగాజేయకెపుడు బదుగురిలోసన్
మిత్రితసుగుణములెంచుము
స్తోత్రమ్మునకీవుతగుదు తొలుతకుమారా. 15

---

# తోలేటి కేశవశతకము.

—:o:—

సీ. శ్రీమత్కరీంద్ర సంసేవితాంఘ్రిసరోజ
దీనచకోరాబ్జ తేనమోస్తు
యిందిరారమణ గోవిందనారాయణ
దేవకీనందన తేనమోస్తు
వాసుదేవముకుంద వామనాచ్యుతకృష్ణ
దివ్యమంగళరూప తేనమోస్తు

మాధవాధోక్షజ మధుసూదనోపేంద్ర
దినకరాధికభాస్వ తేనమోస్తు

గీ: యనుచునుతి శతములుసేయు చనుదినంబు
చతురరతిగతిపతి మతు॰తిశయిల్లె
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరాకేందువదన. 1

సీ. శంఖచక్రగదాపి శార్ఙ్గపాణిముకుంద
కరుణాలవాల మంగళమునీకు
పుండరీకాక్ష మార్తాండకోటిప్రభా
కమనియ్యరూప మంగళమునీకు
గరుడరాజతురంగ కలుషానిలభుజంగ
కౌస్తుభాభరణ మంగళమునీకు
వేణునాదవినోద విబుధలోకామోద
కరిరాజవరద మంగళమునీకు

గీ. ననుచు మంగళహారతు లనుదినంబు
సేయుచున్నట్టినన్నెడ బాయదగునె
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరాకేందువదన. 2

సీ. మేనుబంగరురంగు నానుపచ్చనిపట్టుతా
నుభక్తులకోర్కె లీనబూను
పసిడిబంగరునీరు భద్రకాంతులగేరు
చారుమేచకకాంతి మీరుతీరు
గోపాంగనలప్రాపు కువలయంబులయేపు
కోమలనీలంపు కొప్పురూపు

వారకాంతలనేటి వన్నెలనేగదాటి
కుసుమాయుధుని సీటఁగోటమీటి

గీ. బోటిరోవానిపాటియే వీటినైన
మేటిమగలందులకు మాటనాటవమ్మ
వనితవతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరాకేందువదన. 3

సీ. నందగోపకుమార బృందావనవిహారసుం
దరాకార గోవిందధీర
గోపీమనోహార గోపాంగనాజార
మునిమనస్సంచార ముక్తిసార
మేరుమంధరధీర చారువీణాధార
కాంచనకేయూర కలుషహార
పరిణమితమందార రణరంగజయశూర
కంసాదిరిపుభీర ఘనసమీర

గీ. సమరసాహస విక్రమసదయహృదయ
విమలగుణరత్న నన్నిట్లువిడువదగునె
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరాకేందువదన. 4

సీ. నిత్యసత్యకలాప నిగమాంతసల్లాప
విదళితాఖిలపాప విశ్వరూప
మునిజననిక్షేప ఘననీలరుచిరూప
ప్రశమితసంతాప ప్రణవరూప
విదళితహరశాప విగతదానవకోప
విక్రృతదైత్యవిరూప విపులభూప

కల్యాణగుణరూప ఖండితాసురచాపయదు
కులకులభూప బాలగోప

గీ. పుణ్యస్వరూపవిబుధజనజేగియ్య మానసద్విమలచరిత
భవ్యమాయిట్లు నన్నెడబాయనీకు
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరాకేందువదన.

సీ. వేణునాదవినోద వికసితాంబుజపాద
విదళితభవభేద విశ్వమోద
పాంచజన్యనినాద పరగర్భనిర్భేద
విమలరూప వివాదవిదితవేద
దానయాన్వయవేద ధరణీసురామోద
కరినుతసంవాద గగనపాద
సర్వజ్ఞత్రిభువన స్వాపితమరియాద
నిఖిలపాపభేద నిత్యవాద

గీ. కోమాలాకారకళ్యాణ గుణగరిష్ఠ
చక్రధరలోకరక్షక శరణుశరణు
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరాకేందువదన.

సీ. చరణరేణువిముక్త శాపమానవధూటి
విజితదానవకోటి విజయధాటి
గుణరత్నసవవేటి కుటిలమాయాజాటి
దనుజవైరులకు సంతానవాటి
హరిదిశమకుటవిస్ఫుట నూత్నమణికోటి
ము:పాటల।పబౌకమలమూటి

విబుధరాజకిరీటి విపులవేల్పులమేటి
కనకరాజితశాటి గరుడఘోటి
గీ. సుగుణపరిపాటియగువాని సొబగుతోటి
గానరికసాటిచర్చాటి హాగ్రిచేటి
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరాకేందువదన. 7

సీ. కోపమాహృదయసంతాపమా నీమోము
జూపుమాయనిన యాశ్రీపతికిని
నేరమాయిదినాకపచారమా నీకౌఁగలీయ
వన్నునుకంసహారునకును
దోసమాయిదిపరిహాసమా నీకింతరోసమా
యనిబిద్విలాసునకును
భేదమాయీమాట ఖేదమానీకింత
వాదమాయనిన దామోదరునకు
గీ. ఆలినొల్లనివానికీలకూరనువుప్పు
చాలదుయనుస్నంజ్ఞ నొప్పెనమ్మ
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరాకేందువదన. 8

సీ. వనజేందిరావాస వక్షస్థలమువాని
తిలకంబునుదిటిపై దీర్చువాని
గోవర్ధనమహాద్రి గొడుగుబట్టినవాని
చెలగిరాసక్రీడ జేయువాని
పశురత్నములకైన బాధమాన్చినవాని
గోపాలకత్వంబు గొన్నవాని

దారుమయాత్మతఁ దాల్చియుంచినవాని
పట్టుపుట్టము మొలగట్టువాని
గీ. సతతమవసరభోగ వాంచాభిలాష
బద్ధుఁడగువాని భక్తపాలివాని
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరా కేందువదన. 9

సీ. క్షీరాంబునిధిసోమ నిర్జితాఖిలకామ
ప్రణవచిహ్నితనామ ప్రభులలామ
నీలమేఘశ్యామ నిఖిలశత్రువిరామ
విమలపుణ్యస్తోమ విజితరామ
నవతులసీదామ నారదాదిప్రేమ
తారకామలనామ దనుజభీమ
పరమపావననామ భక్తలోకారామ
మధుకదోషవిరామ మహితసీమ
గీ. సద్గుణస్తోమ శాత్రవీసమరభీమ
యనుచు సన్నుతిజేసిన మనవివినుఁము
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరా కేందువదన 1

సీ. కౌస్తుభమణిభూష ఖండితాఖిలదోష
పరమసత్వవిశేష భక్తపోష
ప్రశమితరిపుదోష ప్రహ్లాదనుతభూష
వేదాంతపరిభాష విపులదోష
వివిధాంబురుహపూష వివిదార్ఘసంతోష
వినుతవిశేష సదేదఘోష

ముదితామలాశేష ముఖనుతిప్రియవేష
మునిజనస్తుతవేష యగనిమేష

గీ. సచ్చిదానందరూప సత్యాన్వభామ
సుందరాకారభవతుతేవందనంబు
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరా కేందువదన. 11

సీ. బలిదైత్యసామ్రాజ్య పదముఁగైకొనువాఁడు
ప్రభలవాలిని భంగపఱచువాఁడు
కురుపాండవులుసంధి కూర్చబోయినాఁడు
విదురునింటను విందుసేయునాఁడు
దుర్యోధనార్జునుల్ దోడుకమ్మనునాఁడు
సైంధవుసమకట్టి చంపునాఁడు
భీమదుర్యోధనుల్ సాముజేసిననాఁడు
కుతికలశ్వత్థామ గోయునాఁడు

గీ. పరమకాపట్యమెల్లను ప్రకటమయ్యె
గామినులనేచుటకు నిపుడేమిప్రాప్తి
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామిదేవరా కేందువదన. 12

సీ. దండముద్దండకోదండ పాండిత్య
ప్రతాపమార్తాండనీకు
దండమఖండప్రచండ ఖండితశత్రు
మండలకాండ ప్రకాండనీకు
దండమకాండవే దోర్దండబాండవ పం
చాండవనతమాఖండనీకు

ఖండమఖండమార్తాండ చండప్రభా
మండలచండ ప్రచండనీకు

గీ. లనుచుసాష్టాంగదండములనుదినంబు
జేయుచుండినకరుణ వేంచేయుటరుదె
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవస్వామి దేవరా కేందువదన. 13

సీ. పరమార్థదర్శిత పరతత్వసంవేద
యుతమనోయోగీంద్ర యపరిమాది
నాధబిందుకళావినోద • బ్రహ్మవపరి
సాదజీవేశ్వరా భేదవాది
ధన్యతావాప్తి శుద్ధబ్రహ్మచైతన్య
విషయకజ్ఞాన ప్రవీణయోగి
పంచాక్షరీగాన పత్యమంత్రోపాస
నార్జితసాద్వికా నందవేది

గీ. మహితతోలేటిలింగయామాత్యరచిత
సీసపద్యప్రసూనాలి శిఖరిమొసగి
వనితతోలేటిపట్టణవాసుఁడైన
కేశవాస్వామి దేవరా కేందువదన. 14

సీ. వందనమిందిరా నందకంకమనోజ్ఞ
సుందరాకార గోవిందనీకు
వందనంబమల సత్కుందశారదనీర
దేందుకీర్తి ప్రభానందనీకు
వందనంబాత్మఘ్రి నందారుమందార
నందనందన ముకుందనీకు

గీ. యనుచువందనములుజేసి యభినుతించి
కవితప్రాప్తిన సంభంద గతియుదెల్పి
వనితతోలేటిపట్టణ వాసుఁడైన
కేశవస్వామిదేవరాకేందువదన. 15

# ప్రసన్నరాఘవశతకము.

—:o:—

ఉ. శ్రీహరిజానకీరమణ శ్రీరఘునాయకమీమహత్త్వమున్
బాహుబలంబు శౌర్యమును భానుకులంబునబుట్టురీతులన్
బోహణచేసిమీకథను బూర్వులుచెప్పగ విన్నయంతనా
యూహనొనర్తుసూక్ష్మముగ నొప్పులకుప్ప ప్రసన్నరాఘవా. 1

ఉ. మానవజన్మమెత్తి బహుమాయలతో బచరించిమాటకై
కానలకేగిజానకినిగానక తంత్రమువన్ని ప్రాపుగా
వానరసేనగూర్చుకొని వాలినిజంపిపయోధిదాటియున్
దానవవీరులందునిమి ధన్యుఁడవైతి ప్రసన్నరాఘవా. 2

ఉ. రాముఁడుసీతకేతగును రామునికేతగుసీతయింతకున్
రామునిసీతయంచు రఘురాముని దేవియటంచు దేవతల్
దాముసుమోదమందియు నుదారమనంబున సంభ్రమంబుతో
రాముఁడుసీతచేకొనును గంజిలుమాకు ప్రసన్నరాఘవా. 3

ఉ. రామునిపాదపద్మములు రాతికిసోకినయంతమాత్రనే
కామునిబాణమో యనగకంజదళాక్షిస్వకీయరూపమై
ప్రేమతో మ్రొక్కినిల్చితనపేరును గౌతమమునిశాపమున్
భామయువిన్నవించె తనభాగ్యమటంచు ప్రసన్నరాఘవా. 4

చ. మిథిలపురాధినాథుఁడును మిక్కుటమైనప్రతిజ్ఞ చేసియున్
పృథివిలో రాజవల్లభులు పుత్రివివాహము జూడవేడుకన్
ప్రథితమనస్కులై ధనువుభగ్నముజేసిన సీతనిచ్చెదన్
మథుహరి దేవదానవులు మానవులైన ప్రసన్నరాఘవా. 5

ఉ. వేగమె రామలక్ష్మణుల వెంటనుబెట్టుక యామునీంద్రుఁడున్
రాగనె రాజుతోడ్కొని రాజ్యముపావన మాయెనంచు తా
సాగిలిమ్రొక్కఁ గౌశికుఁడు సంభ్రమమునూనని దీవనిచ్చెయా
కాగలయర్థ మీగడియగావలెనంచు ప్రసన్నరాఘవా. 6

ఉ. రాతినినాతిజేసి బలురాక్షసవీరుల సంహరించి వి
ఖ్యాతిగనాదుయాగమును గాచెమహాత్ముఁడటంచుచెప్పగా
ప్రీతిచెలంగి నాకులుకుబిడ్డల కన్నిక పెండ్లిచేసెద
న్నీతఁడు అల్లుఁడైనచెలినిత్తును వేగ ప్రసన్నరాఘవా. 7

ఉ. సీతనుజూచి సమ్మతుచు చెప్పెను లక్ష్మణుతోడ రాముఁడున్
భూతదయాళుఁడైన మునిపుంగవుబంపిన రాజుకొల్వునన్
మాతనుమాడగల్గెనని మానసమందు లక్ష్మణుండుదా
సీతపదద్వయంబులను శీఘ్రముచూచి ప్రసన్నరాఘవా. 8

ఉ. తల్లడమంద దేవతలు దానవులన్ రఘురాముఁడప్పుడా
విల్లవలీలగా విఱువ వేడ్కతో నా జనకుండు నాత్మలో
నల్లఁడు రామచంద్రుఁడని యంతటివాఁడునుగల్గినంతకున్
పల్లవపాణిసీతతనభాగ్యము కాదె ప్రసన్నరాఘవా. 9

ఉ. పెండ్లికుమారుఁడంచు తగబెట్టిరిబొట్టునుకండ్లగాటుకం
పెండ్లికుమారరామయనిపిల్చిరి వేడుకతోడనందరు
న్పెండ్లికుమార్తెఁజేసిమఱిబెట్టిరి సొమ్ములుచాలసీతకు
న్పెండ్లికలంకరించితగ ప్రేమలమించి ప్రసన్నరాఘవా. 10

చ. మదగజయానసీతకును మంగళసూత్రము గట్టెరాముఁడుం
వందనునితండ్రికిన్ మగువమచ్చికతో దలఁబ్రాలుబోసియున్
ముదితశిరస్సునంబ్రియుఁడు ముత్యములన్నియు విచ్చినిల్చియుం
గదిసి పెనంగఁజేతులును కన్నులజూచు ప్రసన్నరాఘవా. 11

చ. ముదమునరాముతమ్ములును ముగ్గురుచూచియు మోదమందియు
నెమ్మదలునకైకపుత్రునకు ముచ్చటగాతగఁబెండ్లిసేసియున్
సదయుఁడు లక్ష్మణుండనుచు సమ్మతికూతురు నిచ్చెవేడుకన్
తుదకడగొట్టుతమ్మునికి దోఁచినబిడ్డప్రసన్నరాఘవా. 12

ఉ. కల్గెనునాకొమార్తెలకు గౌరవమైనటువంటియల్లుఁడున్
గల్గెనునాదుభాగ్యమున కంజదళాక్షునివంటిబ్రేపువే
గల్గెనుభక్తియుముక్తియును కర్మవిమోచనమాయనేటికిన్
గల్గెనటంచుబిడ్డలను గ్రక్కునఁబంపె ప్రసన్నరాఘవా. 13

ఉ. వాలినిజూచితారయును వాక్కుకరంబున మోదుకొంచుహా
వాలిపరితాపశాలియని వర్ణనసేయుచు నెట్లుతాళుదుం
జాలగప్రేమజూచిన నసారెకుసారెకు గారవించిని
బాలునిజూడుమంగదుఁడు పాయఁడునిన్ను ప్రసన్నరాఘవా. 14

చ. పడమరతూర్పునుత్తరము బంపగఁబోయిరి వానరాధిపుల్
వడితనచేతిముద్రికయు వాయుతనూజునిచేతికిచ్చియుం
దడయకపంపెరాఘవుఁడు దక్షిణమార్గముబట్టిపొమ్మనెన్
బుడమినిజాడలన్వెదుక బోయిరివారు ప్రసన్నరాఘవా. 15

చ. తెలతెలవారవచ్చినసుధీరుఁడు యాహనుమంతుఁడప్పుడున్
కలవరమందికాంతనటుగానక రావణుజంపనేమొకో
తెలియదుయేమిసేతునని ధీరతచేవనమెల్లజూడగా
నెలతనుగాంచెనొక్కతెయు నేడ్చుచునుండె ప్రసన్నరాఘవా. 16

ఉ. రమ్మువిభీషణా యనుచు రాఘవులున్ దయచేసినప్పుడున్
యిమ్మహిలంకపట్టమున కిప్పుడు రాజ్యాభిషిక్తు జేసెదన్
తమ్ములలోన నీవు నొకతమ్ముఁడవంచును గౌరవించియున్
బొమ్మనెలంక ముట్టడికి బోయిరి వేగ ప్రసన్న రాఘవా. 17

ఉ. సంజివి తేనుబంపవలె జాగికసేయక వేళ నిప్పుడే
యంజని దేవపుత్రు మతియుంపిరి రాముసుషేణులిద్దఱున్
అంజలి జేసి తల్లిమరియందున విక్రమశాలి వేగమే
సంజివికొండ దెచ్చెనని సాహసమొప్ప ప్రసన్న రాఘవా. 18

ఉ. శ్రీకరుఁడైన రామునకు సీతకు ప్రీతిపద్యవాక్యము
ప్రాకటమైన వైభవము భాగ్యములంగలరీతి జెప్పితిం
చేకొని చిత్తగించినను చెల్వముగా నెడబాయకుండుమీ
లోకములోన నీవె గతిలోలుఁడవైన ప్రసన్న రాఘవా. 19

ఉ. మంగళమౌను రామునికి మంగళమౌననుగన్న తల్లికిన్
మంగళమౌను లక్ష్మికిని మంగళమౌమము గన్న సీతకు
న్మంగళమౌను జానకికి మంగళమౌదుమ బాయకుండుమీ
మంగళమౌను యిద్దరికి మమ్మునుగావ ప్రసన్న రాఘవా. 20

రాజులమేటి రాజు రఘురాజ మహాత్ముడు రాజమాన్యుడై
రాజితకీర్తిశాలియగు రాముడు రాజ్యాభిలాషసక్తుడై
యాజగమేలు రాజులకు నిష్టజనంబులు నింపౌనర్చెనూ
భూజనభక్తరక్షకుడు భూతిదలం చెప్రసన్న రాఘవా. 21

చ. దయకలవాడు భానుకులధన్యుడు రాముడు రాజ్యమేలగా
భయములేదు కల్మియెడబాయదు నన్నిటభాగ్యముల్ మరిన్
బ్రియముధర్మముల్ గలిగి ప్రేమ పెనంగి మహావిభూతులై
ప్రియసఖులున్ సఖీజనులు పేర్మితో గూడి ప్రసన్న రాఘవా. 22

# శ్రీ మ హా దే వా శ త క ము.

---:o:---

శా. శ్రీమంతుఁడగు వాసుదేవుఁడుసురజ్యేష్ఠుండు దేవేంద్రుఁడున్
సోమాదిత్యులుసర్వదిక్పతులుఁగాగిన్ జుట్టాలుపక్కాలునా
నామర్త్యుల్ గనలేనినీమహిమలె న్నన్ దుష్కరంబైనను
త్రైమాసాహసికంబు జూడుముమహా దేవా! భవానీధవా. 1

శా. నీవేదిక్కనినమ్మినందుకుజగ న్నేతా దయాళుండవై
నావిజ్ఞాపనమాలకించియిఁకనై న్నన్ముద్దుచెల్లించినీ
నీవాసక్తిమనంబునందు గలుగన్ జింతింపవయ్యానను
ద్దేవాధీశ్వరనీకుమ్రొక్కెదమహా దేవా! మహానీధవా. 2

మ. కనుగోఁజాలరుజన్మమునఁగాఁ గన్మాసికనిచ్చినం
తనయాచరిత్వచర్వణంబులకునా నందించుచున్ మానవుల్
కనకాగారకళత్రపుత్రకసంఘకూర్మినిర్బంధ దు
ర్దినహానింబడిమ్రగ్గిపోదురుమహా దేవా! భవానీధవా. 3

శా. వారిన్నీఁనిసాటిజెప్పుటకు సర్వజ్ఞుండవైనట్టినీ
పారిందానవుసమస్తలోకములలో నాత్మీయభాగ్యంబునం
జేరన్గల్గుచునీసమీపమునకున్ జిత్తానుసారంబుగా
ధీరాగ్రేసరనన్నుఁబ్రోవుముమహా దేవా! భవానీధవా. 4

మ. కనువెట్టంబడికాలెమన్మథుఁడు నీకాండంబుచేమూఁడు ప
ట్టణముల్ గూలెను నీత్రిశూలహతిచేశారయ్యె నామిత్తి సా
ధనవైకల్యములేను నీకయితెనా దౌర్భాగ్యమానన్నుఁజెం
దినపాపంబుహరింపవైతివిమహా దేవా! భవానీధవా. 5

శా. ఈలోకంబునరాచవానితలకా యేలేదుమర్యాదలిం
కేలాగుంకును వర్ణసంకరముల య్యేదానికిన్ముందుగా

మూలంబుం ద్విజుఁడుం సమంబనెదు దుష్కర్మాగ్రిణుల్ పెద్దలై
తేలోకానకు సౌఖ్యమెట్లగు మహాదేవా! భవానీధవా. 6

శా. లాలామూత్రపురీషసంకులముకీలాలప్రపూరంబునై
తోలే చేర్పడిగాని లోనరయ నెంతో రోఁతయీ మేనికై
యాలోచించిన నేది జూచిన నసహ్యంబిందు నీదేహమం
దేలా మోహము నిర్వికారివె మహాదేవా! భవానీధవా. 7

మ. ధనధాన్యంబులతోఁ దురంగమగజేంద్రశ్రేణితో రంభతో
నెనయౌ కాంతలతో నిరంతరము లక్ష్మీయంబెనోపాయటం
చును మార్పల్కుచునుండు నెవ్వనిగృహస్తోమంబు నప్పాపుఁడా
దిని మీభక్తునిఁ గాఁదలంచెద మహాదేవా! భవానీధవా. 8

మ. సిరితోఁ బుట్టువు నార్యకుంబతివియూ చింతామణీదేవతా
సురభీకల్పతరుత్కరంబుఁ గుదత్కుండైన దేవేంద్రుపై
దొరవీ రేడుజగంబులేలుటకు నీతో పాటు బిచ్చానికే
తిరుగం జేసితివేమి చెప్పుదు మహాదేవా! భవానీధవా. 9

మ. భువి సావాసముచేతనైజగుణముల్ పోనేర్చునే కాకితోఁ
గవగానుండియు మేఁతమేసి యొకపక్కంబడి నానాఁటికిన్
దివసంబుల్ పలుఁబడ్డ వోఁబికముజాతివ్యక్తిలో కాకప
త్రవికారంబొకనైనఁ జెందునె మహాదేవా! భవానీధవా. 10

మ. హిమవత్పర్వతపుత్రికారమణ నిన్నేలాగు మెప్పింతునా
శ్రమనే నాఁటికిఁ దీర్తువీవు గడియో జామో నెలో యేడో ని
క్కముగ జ్జీవితకాలముం దెలియ శక్యంబౌనె మాబోంట్లకున్
స్థిమితం బెట్లు ఘటింపఁ జేసెదొ మహాదేవా! భవానీధవా. 11

మ. హిమవత్పర్వతపుత్రికారమణ బ్రహ్మేంద్రాది బ్రహ్మర్షిముఖో
త్తమసంప్రార్థిత పాదచంక్రమణ వేదార్థప్రతిష్ఠాపనా

సుమహాత్కార్య ధురీణ దైన్యగుణయుస్తోక ప్రభావాంచితా
త్రిమతోద్ధారణకృత్యకారణ మహా దేవా ! భవానీధవా. 12

శా. కట్టింబుట్టినవహ్నికాల్చుచుమటి తత్కాష్ఠంబు నన్నట్లుగాఁ
జెట్టింజీమలుపట్టుకొన్నపగిదిం జీకాకుగావించుచున్
మొట్టోపాపమువద్దుపొమ్మనినసే మోకానిపోఁజాలదీ
తెట్టుప్పంపదలేదిలేదనిమహా దేవా ! భవానీధవా. 13

మ. మొకమానందకరంబుగా శ్రీణవమున్ మోప్రియించియాపాదమ
స్తకపర్యంతముభూతిలేపనము కాంచశ్వర్యమాయించిపా
యకరుద్రాక్షకుసుమాలి కల్మొడనుడాయంజేయు నప్పుణ్యమూ
ర్తికిఁ గీడేటికిసంభవించునుమహా దేవా ! భవానీధవా. 14

మ. శివభక్తుఁడగువాఁడె దైవమనుచుం జింతించిలింగార్చనా
పరిశుద్ధుఁడై భసితాంగరాగుఁడగుచున్ భస్మత్రిపుండ్రాంకిత
చ్ఛలిఫాలంబుననావరింపగలఁడా చారప్రభావజ్ఞుఁడై
దివసంబుల్ కడకొత్తువిజ్ఞుఁడుమహా దేవా ! భవానీధవా. 15

శా. ఏమీతోఁచదుమంచిసాధనము నాకేతుచ్ఛసాంసారిక
వ్యామోహంబునఁబోయెఁగాలమువృథా యానంబుగానింక
నన్నేమారాదరింపఁజేసెదవో ముందేచూతుమా సాంబ మూ
ర్తీమృత్యుంజయదీనపోషకమహా దేవా! భవానీధవా. 16

మ. మలమూత్రంబులపుట్టపొట్టయసకృన్మాంసాస్థిచర్మాస్రిసం
కులమీమేనుయనుప్రపంచమునఁ గన్ గోపంబుమోసంబదే
వలనంజూచినదీనిపొందువిడిపో వంజాలదెందైనఁబం
దెలకీబొందెయకాదెమూలముమహా దేవా ! భవానీధవా. 17

మ. కరియేమంత్రిమదాపఠించెపఠియే కాలజ్ఞతంలింగ నీ
త్కారనాభర్చనమాచరించెధృతిచేతన్ లూతనీమంబునే

గురుశిక్షాపరతంత్ర గ్రహించెనివి పెక్కుల్ చెప్పగానేల సు
స్థిరమౌభక్తియె నీకు ముఖ్యము మహాదేవా! భవానీధవా. 18

మ. మతిమంతుల్ గుణవంతులుత్తములు సన్మార్గుల్ శివార్చనా
వ్రతసంపూతచరిత్రులార్యజనులారాధ్యుల్ సదాసాధువుల్
క్షితిపై వారలభక్తిపూర్వకముగా సేవించువారేయనిం
దితమార్గంబున నిన్నుఁ జొత్తురు మహాదేవా! భవానీధవా. 19

శా. ఆలుంబిడ్డలకంటెఁ జుట్టములు లేరంచున్ మహామోహినై
కాలక్షేపము జేచితింజనియెనా కాలంబు నిష్కారణం
బాలోచించితి యాజవంజవరుమా హానోకహచ్ఛిత్తిశిక్
స్త్రీలే శూలక మెల్లవారికి మహాదేవా! భవానీధవా. 20

మ. చలియెంగాలము మూఁడుపాతికల హా సంసారసంకటంబులో
మునుఁగం దేలనుగాని యుండెటుఁగనా ముప్పప్పతోకప్పకై
యణువున్నట్టిభుజంగమంబుక్రియ డాయంజూచునీదేహికై
దినముల్ మృత్యువుపొంచియుండును మహాదేవా! భవానీధవా. 21

మ. అనుమానింపగనేల నీచరణసేవాసక్తుఁడై ముక్తిఁజెం
దనిదౌర్భాగ్యుఁడు లేఁడులోకమున లూతాదంతికాలాహివ
క్కణవాసాధికమూఢజాతులును శంకాటంకముల్ లేక ము
క్తిని సేవించుటమాకు సాక్ష్యము మహాదేవా! భవానీధవా. 22

మ. అనుకుంటే యిది నోటితప్పు భవదీయంబైన సామర్థ్యముల్
మనుజుల్ చక్కఁగఁ జెప్పఁ గోదగరు సామాన్యుండవా నీవు నీ
వెనుకం జూచినవారెకొందఱికె నీవే తండ్రివై యొక్కరీ
తిని బాలింపకయున్కి మంచిదె మహాదేవా! భవానీధవా. 28

శా. నీచేతన్ మృగంబుపైఁ గరుణవా నేత్రాగ్నికోష్ఠంబనా
డాచేగొడ్డలిమొక్కపోవునని చూడావారిచేఁజిక్కకా

కాచేవారలులేకనాయరుచికై కన్నప్పనోటంగిలై
తేచింతామణియట్లుదింటివి మహా దేవా! భవానీధవా. 24

శా. సాంబా! నిన్నుదలంచివేఁడుకొని శశ్వద్భక్తినీపాదప
ద్మంబుల్ పూజలొనర్చుభక్తులకు సిద్ధంబాగదాభిక్షువే
షంబుల్ భూతిదిగంబరత్వము విషాశిత్వంబులిమ్మాటనా
డంబేయెవ్వనిగొల్తురట్లగుమహా దేవా! భవానీధవా. 25

శా. రాజానుగ్రహమెట్లొయల్పునిపయిన్ రాగానతండేతనే
రాజైనాననిపంచమేధృనికృపం రాగాంధుఁడైమంచిచె
డ్డేచూడండది తపినంశవమువాఁడే జుమ్మియాధాత్రిపై
తేజోనిర్జితపూర్ణిమాశశిమహా దేవా! భవానీధవా. 26

మ. తలిదండ్రుల్ సుతులన్నదమ్ములును మిత్రామాత్యవర్గంబు బం
ధులుకోడండ్రునువెంటరారని సుబుద్ధుల్ పెక్కుమార్గంబులం
దెలియంజెప్పినవారిఁ బోవిడిచిపదిక్కేకనుంగొంచు చిం
తిలినిన్ గొల్వఁగలేడు మూర్ఖుఁడుమహా దేవా! భవానీధవా. 27

మ. ధనమెంతేనిగడింపగాదలఁచిచిత్తంబందు నప్పుణ్యపా
పనిరీక్షాక్రియమెల్లఁబోవిడిచి దుర్భావానువృత్తిన్ సదా
దినముల్ పుచ్చుచు సొమ్ముగూర్చుకొనుచుండే మూర్ఖుఁడెట్లోతుదిం
దినకృచ్చంద్రకృశానులోచనమహా దేవా! భవానీధవా. 28

శా. దేవాధీశమహేశశంకరగిరీశాకాలకాలాభవా
భావాభావవిచారదూరహరశర్వాపార్వతీనాయకా
శైవాంతఃకరణాబ్జబంభరశివా చంద్రావతంసానమ
స్తేవామాంకసతీమణీశుచిమహా దేవా! భవానీధవా. 29

శా. శ్రీమన్మంగళమూర్త్యసంస్తవనపాత్రీభూతపాదద్వయా
విమలాభాషునిరస్తలోక నిచయావిద్యాభృతభక్తౌఘుదు

స్తిమిరాళీభవదీయపాదములకున్ శీతాంశుకోటిద్యుతీ
స్తిమితంబుల్ గలుగంగఁ జేయుము మహాదేవా! భవానీధవా. 80

# దీనపోషకశతకము.

—:o:—

ఉ. శ్రీరమణీయవైఖరుల జెన్నలరారు సమస్తలోకముల్
భూరితరప్రభావమున గొల్పెసగన్ సృజియించిజీవనా
ధారముసర్వజీవులకు దారతగల్పనజేసిప్రోచునిన్
జేరిభజింతునెప్డుగృపచేసను బ్రోవగదీనపోషకా. 1

ఉ. ఎన్నగశబ్దసౌష్ఠవమునించుకయేని నెఱుంగడంచుదా
జెన్నగుశాస్త్రముల్ పరగజేసెనవాడనుగాడటంచుసం
పన్నతలేదటంచు ననుమాటికిదూఱకసత్వరంబనా
విన్నపమాలకింపు మవివేకభేదకదీనపోషకా. 2

చ. అమలచరిత్ర! లక్ష్యములనారయలేను; సువృత్తగీతమా
ర్గముగమనింపలేదు; కవిరాజులసేవలొనర్పలేదు; నే
మమునద్వదంఘ్రియుగ్మమునె మానసమందిడి నీకృపాతిరే
కమునరచించుచుంటి గృతిగైకొనిప్రోవవెదీనపోషకా. 3

చ. నిలుకడలేదునామదికినేర్పుపహాళిక్కి; వివేకమందునా
తలపగరాదు; సత్యమదిదబ్బర; శాంతమునాస్తి; విద్వదా
గలకనువింత; గౌవరముకానగరాదికమందుకైననిఁ
[illegible]ల చెదలోపమెంచకయె దానునిబ్రోవుముదీనపోషకా. 4

ఉ. ఎక్కడనిల్చియుండినను నేదరికేగిననేమిచేసినన్
జిక్కనినీకథామృతమెచేరల జొఱ్ఱగమానసంబున
నిక్కముగాదలంచితిని నేర్తునొనేరనొదేవ! కావునన్
మక్కువతోడనాకుదృఢ మానసమీగదెదీనపోషకా.

ఉ. ఎండఁబునిన్న గొల్చితిరియించిరి పూర్వులపూర్వులైఖరిం
గొండలమందకిప్పునిను గోరిభజించెద నేనునాగతిన్
వందనముల్ గ్రహించి యమపాశములన్ దెగగోసివేగమే
సుందరరూప! నన్ను గృపజూడగ వేడెదదీనపోషకా. 6

ఉ. ఏటికినన్నిటుల్విడిచెదే నవివేకుఁడనై తినంచునా
చీటికిమాటికిన్విసువు జెందెదునిక స్మరియింపనంచునా
గోటుదన్నానసేఖలులగూడి చరింతునటంచునామతిం
కేటికసడ్డసేయనిటులేర్పడజెప్పుమదీనిపోషకా. 7

చ. సకలచరాచరంబులను సాకెదుబాలనసేయజాలునీ
కొకమనుజాధమాధముని నోముటదెంతటికార్యమౌనునా
కికశరణంబువేఱకలదే భవదంఘ్రులుగాక యోజగ
త్ప్రకటితకీర్తిభక్తజన పాపవిమోచకదీనపోషకా. 8

ఉ. పెన్నిధిగన్న పేదగతి వేడయుమొందినభీరుకైవడిం
గన్నెనమూకములోకములగాంచిన యంధునిభాతిసత్యసం
పన్న!త్వదీయనామమును భక్తిబఠింపుచునున్న వేళనే
నెన్నగరానిసంతసము నెంతయుబొందుదు దీనపోషకా. 9

చ. పలుకొకరీతినుండ నుస్వభావముకానొక దారిజేరునా
తలపొక తోటనుండు మఱిధ్యానము వేఱొకమార్గమందుచం
దలకొనుచుండుగావునను దారకృపామతితోడవేగని
శ్చలమతినాకొసంగియిక సాకగ దేనను దీనపోషకా. 10

చ. ఇదితనభార్యయంచు మరియాతడుపుత్రుడుమిత్రుడంచు దా
నెదిగనదానినమ్మితనదేయని మోహనిమగ్నుడౌచునె
మ్మదిస్మరియింపడెప్పుడును మానితమౌభవదీయనామముం
దుదినదుడేగునొక్కరుడె తోడొకనకెద్దియుదీనపోషకా. 11

చ. సురచిరమైనయుక్తియును సూరిజనంబులపైఁబ్రపత్తియుఁ
గురుజనపార్థివోత్తముల గూరిమిమీఱఁగఁగొల్చుభక్తియుం
బరయువతీధనాదులను బాపమటంచు ద్యజించుశక్తియుం
దిరముగనాకొసంగినను ధీరునిజేయవెదీనపోషకా. 12

చ. అరయఁగనీతిదూరులు నిరక్షరకుక్షులెయయ్యుఁగొందఱీ
ధరణిననేకరీతుల వితండపువాదములన్ ఘటించిసు
స్థిరమతులైనవారలకు దీఱనికీడొనరింపజూచుచుం
దురుగదయట్టివారిపెను ధూర్తత బాపవెదీనపోషకా. 13

చ. ఎఱుఁగకచేసినాడనని యీశ్వరదాపగనేమికార్యమే
నెఱిగియుజేసిపేర్చితిననేక దురాగతకార్యముల్ సదా
తఱుగనిభక్తితోడనిను దప్పకకొల్చెదగాననాకికన్
దిరమగుజ్ఞానమిచ్చికృప దేర్పఁగదేనను దీనపోషకా. 14

ఉ. పుట్టినదాదినీవఖిల భోగములన్ ఘటియించిమమ్ము జే
పట్టియనేకభంగులను బాలనజేయఁగలేదెయిప్పుడీ
విట్టులుపేక్షజేయుటకునేమి కతంబొయెఱుంగమేమునీ
వెట్టులుచేసినన్ గృపగనేమదినెంతుము దీనపోషకా. 15

ఉ. ఈదుచుదుఃఖవారినిధినే దరియుంబొడగానలేకని
న్నాదటగానలేక మనసారగఁబూజలొనర్పలేకనే
నాదిజరించినాడవినుమవ్యయ! ముందునరీతినిప్పుడే
నీదరిఁజేరినాడనిక నేరములెంచకుదీనపోషకా. 16

ఉ. పండితులైనవారలు సభాముఖమందు సునీతిమార్గముల్
దండిగబోధఁజేయుచు ముదంబుజనాళి కొనర్పదుర్మదో
ద్దండతవారిజేరకయ ధర్మపుమార్గములంజరించినే
మెండుగదప్పుజేసితి క్షమింపవెమ్రొక్కెదదీనపోషకా. 17

చ. దినమునకొక్కమాఱయిన దీరిక లేదు నిన్ను భజింపదా
ననువుపడంగ నాదుహృదయంబెటకోచనిరాదు దానివే
గనుమఱలింపశక్తి నహి కావున బ్రేమనొసంగి ప్రోవుమా
యనయము గొల్తు నీదుచరణాంబుజయుగ్మమె దీనపోషకా. 18

ఉ. ఇప్పుడు రాజకార్యములనేకముగా లభియించెగాన నిం
కెప్పుడొ చూతమంచు మది నెప్పటికప్పుడె యూహజేసి ని
న్నొప్పుగ బూజసల్ప కిటులూరక పుచ్చితి దీర్ఘకాలమే
యిప్పుడు కొల్వవచ్చితిని కేగతి బ్రోచెదొ దీనపోషకా. 19

ఉ. ఒప్పుగ నీదుపాదభజనౌషధి యెప్పుడు లభ్యమౌను నా
కప్పుడె కిల్బిషజ్వరమదంతయు బాసిచనున్ మహాత్మ! నా
కెప్పటికిందదీయరుజ నింక ఘటింపగ నెంచబోకు నీ
యొప్పనదాల్తు నౌదల మహామహితాత్మక! దీనపోషకా. 20

ఉ. కావున దేవదేవ! ననుగాపురుషావళి జేర్పకుండ, నే
జీవమునైన బ్రేమమును జిత్తమునందలపోయు జ్ఞానముఁ
వావిరిగా భవచ్చరణవారిజముల్ హృదినిల్పి నిన్సదా
భావనజేయుభక్తియు గృపామతినీయవె దీనపోషకా. 21

ఉ. ఎవ్వని భావమెట్టిదియొ యెవ్వని బాహ్యపుజేతలెట్టివో
యెవ్వని మానమెట్టిదియొ యెవ్వని పల్కుల యర్థమెట్టిదో
యెవ్వని సత్యమెట్టిదియొ యెవ్వనిలో గలక్రౌర్యమెట్టిదో
యెవ్వరెఱుంగ నేర్తురది యీవెయెఱుంగుదు దీనపోషకా. 22

చ. సిరిగలవాడు రాజసముచేదన ధాన్యపుగాదె నెన్నడో
బెఱికెదు నంతదాక నిల బీదల ప్రాణము నిల్పబెట్టుని
ర్భరతరఘోరకష్టములు పైబడె నిల్వనశక్యమంచు నిన్
గరమనురక్తి వేడితిని గాంచగదే దయ దీనపోషకా. 23

# తారకరామశతకము.

—:0:—

క. శ్రీమద్వైదేహీకుచ
భూమీభృత్కుంకుమాంక భూషితఘనవ
క్షోమహితచంచలైకో
ద్దామప్రతిభాంబుదరమ తారకరామా. 1

క. కరుణామయుండవనినీ
మఱుగునఁజేరితిని నన్నుమన్నించిభవ
చరణార్చకతతిఁజేర్పుము
తరణికులాంబునిధిసోమ తారక గామా. 2

క. నీపాదనీరజంబుల
నాపోవనికూర్మిపేర్మి నలరఁగమదినం
స్థాపించివేఁడుచుంటితిఁ
దాపత్రయమడఁచిబ్రోవుతారకరామా. 3

క. ధనలుబ్ధ్రమోలధర్మం
బనఁబ్రాణత్యాగమంత యనుతాపమునొం
దునిజముగఁ బ్రాణముతనం
తవోనెమానొగనఁడుతారకరామా. 4

క. పరబాధచేసితద్ధన
హరణముగావించి గొప్పకై సత్రంబు
ల్విరచించుదురయ్యోడువిం
తిరవంతేనిఫలంబుగలదె తారకరామా. 5

క. శ్రీరామువంటిదైవము
లేరీవెదుకంగనెచట లేరనిహృదయం

బారఁగఁజాటెఁగవితా
ధారాగంధేభమెక్కి తారకరామా. 6

క. ఎందఱకుసుతుఁడనైతినొ
యెందఱికిని జనకుఁడనై యాగ్రితినో యిం
కెందుంజరించదనొయి
దందయనెట్టుబ్రోతొసుమ్మతారక రామా. 7

క. ధనికులునిర్ధనులగుటను
ధనికులుధనికులుగనుంటఁ దానెఱిఁగియిలో
కనికారకుఁడైదుష్ట
త్వనిరూఢింధనముగూర్చుదారకరామా. 8

క. నీవేదిక్కనిఁమ్మితి
నీవేధనమంటి నీవెగతియునివేయంటిం
గాపుసనుబ్రోవుము నీ
తావనితాహృదభిరామతారకరామా. 9

క. నాభూమినాధనంబని
యాభీలముగా విరోధమందెదనుజనం
దాభూమియెందఱిదో మున్
దాభావించినదో మఁదారకరామా. 10

క. నీవేతండ్రివిజనకసు
తావనితామణి యెతల్లిత్వతోసదరులే
భావింపఁబిత్రువ్యులుభ
క్తావళిమితాళినాకుఁదారకరామా. 11

క. ఒకరినిజెరిపెదననిపూ
నికశపథంబునెదజేయు నీచునిగనియు

ష్ణశరజుఁడు నవ్వుమదినిం
తకునీదయగల్గఁజేసునెతారకరామా. 12

క. శత్రునితమ్మునిఁబ్రోచుట
శత్రులుమిత్రులును లేరుజగములనీకున్
జిత్రశరగోత్రజపవి
త్రాత్రిజగన్నుతచరిత్రతారకరామా. 13

క. నిన్నదసతతముసేయుచు
నున్నయశఃస్థైర్యవైభవోజ్వలుఁడైయ
త్యున్నతిగనితుదిదిరమం
దన్నిత్యసుఖంబుగాంచుఁదారకరామా. 14

క. వానరులకునలవిగాయుం
భోనిధిగట్టుటకు నీసముజ్వలకరుణం
గాననిచోనటులనుటస
దానతకృపబల్కితెమొతారకరామా. 15

క. సరసింహుఁడవైరక్కసుఁ
బరిమార్చితదాత్మజాతుఁబ్రహ్లాదుని
సత్కరుణంబ్రోవగస్తంభాం
తరమునవర్తించితీవతారకరామా. 16

క. జమదగ్నికినుద్భవమై
సమస్తదేశాధిపతులఁజయ్యనవనిన్
సమయించిదిక్కులనితాం
తమహిమనొందితీవతారకరామా. 17

క. దశరథగర్భాంభోనిధి

ద్యశమెల్లరుగొనియాడఁగ
దశముఖుబరిమార్చితీవ తారకరామా. 18

క. రామాదైత్యవిరామా
భూమీజావల్లభలలామ పోషితవిబుధ
స్తోమాతులసీదామస
దామలతరకీర్తికామ తారకరామా. 19

క. గుహునివిభీషణుఁనుడుతను
నహల్యనుంబ్లవగ నేతనతికరుణాసం
వహనమతిఁబ్రోచితటభ
క్తహింసకరజనవిరామ తారకరామా. 20

క. అనియోగతిఁ బలువిధముల
వినుతించుచునుంటిఁ గానవినువకసన్నుం
గనికరమునఁ గనిసురవం
దనీయనను బ్రోవుమయ్య తారకరామా. 21

క. నీవంటిమహాత్వముఁగరు
ణావిభవత్వమును గలిగినట్టిసుదైవం
బేవంక లేకసుమసీ
తావరనినునమ్మినాఁడఁదారకరామా. 22

క. ధనలోభికిజాగముని
ర్ఘనునకుభోగమును భూరితత్త్వరహస్య
జ్ఞానకనురాగముదర్భర
తనునకరోగమును లేదు తారకరామా. 23

క. వందనము నీకుఁబాలిత
వందిజనావదనంబు పరమానందా

వందనమునీకునాప
ద్బాంధవబహువందనములు తారకరామా 24

క. మంగళమునీకుంగరుణా
పాంగామంగళము దైత్యభంగాభాస్వ
న్మంగళము నీకవితమా
తంగాబహుమంగళములు తారకరామా. 25

క. ఇంతై మానికకుండలు
వంతై మానుపునను నినుడకంతై నదిక
ల్లంతై జలనిధిజొచ్చిని
తాంతముమహిస్వామైతీవ తారకరామా. 26

క. సురలసుర బ సుదకై మం
దరమునసంబోధి తర్వసగముమునంగక
కరుణాత్మమంబరశద్గిరి
దరియింపంగూర్మమైతి తారకరామా. 27

క. గాత్రిపాసుపెన్నముతప్పిన
నేత్రింబులదృష్టివిడిచె నిరతమునంత
శ్శత్రులుమమతంగప్పిన
ధాత్రీస్థలినాశవిడదు తారకరామా. 28

క. అంగము లలితంబనియు
పొంగుచుక్రిమిసమితి రోగపూర్ణోగ్రజరా
సంగతియనిశలపక స
త్సాంగత్యములేకతిరుగు తారకరామా. 29

క. ... ... పరిపానినియతిజ

భిన్నియుమతిమెన్నియుద్వ
తన్నుతితో సాటిరావుతారకరామా. 80

---

# జా న కీ రా మ శ త క ము.

—:o:—

సీ. శ్రీకరఖరకరాంచిత కులశేఖర
లోకైకనాథ త్రిలోకవంద్య
పాకశాసన నతపాదాంబుజాత
సద్గుణగణధామ వైకుంఠనామ
సలలితశ్యామల చకచకితప్రభా
కమనీయగాత్ర పంకరుహనేత్ర
వసుమతీనంద నీవక్షోరుహాలిప్త
చందనాంకిత సదానందరూప
మత్కలిత్వప్రసూన: దామములమమ్మొ
పూజజేసెదగృపజూడుమోజితారి
రామదనుజవిరామ సంగ్రామభీమ
జానకీరామరవికులసార్వభౌమ. 1

సీ. రసమైనలేక నీరసమైనమత్కవి
తామాధురీవనితనువిశాల
తారకనామసుధానిధిలో ముంచి
గాధేయయాగరక్షణప్రసిద్ధి
యాదిగాగల్గిన మీదుచరిత్రమనునవ
రత్నఖచితసుందరవిభూష

యతులితభోగభాగ్యములిచ్చి రక్షింప
కష్టమా నీవుజగత్కు...ంచి
వగుచుదయబూనకింతగా వెగటుబూన
నాయమా నీకుమానవనాయకేంద్ర
రామధనుజవిరామ సంగ్రామమా
జానకీరామరవికులసార్వభౌమ. 6

సీ. నాయమా నీకుదీనజబంధుడవని
గోరితేవన్నిట్లు కాంచపరచె
బూనిసనిటమీాద మానవుడెవ్వడైన
నమ్మునానిన్ను పోన్నిమ్మటంచు
పలికెదవా జగత్ప్రఖ్యాతమైననీ
నీదేవత్వమెవను చింతించుసజన
మందారుడవటంచు మహనీయవేదశాస్త్రం
బులుదెల్ప నాసపడియుంటి
వనమునకు దండ్రివెళ్ళగొట్టినదెచాలు
భక్తజనములో రసాభాసమువలదు
రామధనుజవిరామ సంగ్రామభీమ
జానకీరామరవికులసార్వభౌమ. 7

సీ. సురలవిపత్తి గ్రుక్కింపవాఘోర
సంగ్రామమందు రాక్షసులద్రుంచి
యినసూనునకు బెద్దతనివిచేకూర్పవా
పెనుకువజేసి వాలినివధించి

పాండుకుమారుల భద్రంబు సేయవా
కలనసుయోధనాధుల దెమల్చి
పతితపావననేజేయు పాపమేమి
ఇంచుకైనను నిన్ను బ్రార్థించలేదే
రామధనుజవిరామ సంగ్రామభీమ
జానకీరామరవికులసార్వభౌమ.

సీ. జయదీనమందారా జయసజ్జనాధార
జయసాధుసన్ముని భయవిదూర
జయవారిదాకార జయవనోగంభీర
జయకాంచనోజ్వలశైలధీ
జయఘోరరణశూర జయధార్మికోదార
జయజానకీ మనఃప్రియవిహార
జయదైత్యసంహార జయదుష్కృతవిదూర
జయనిగమాగమ సద్విచార
యనుచునజరుద్రు లత్యంతవినయమును
భక్తిగొల్తురు నీపాదపంకజములు
రామధనుజవిరామ సంగ్రామభీమ
జానకీరామరవికులసార్వభౌమ.

సీ. పెంపుడింపవుగదా తెంపరులైసాదు
బాధలొనర్చిన పాపమతుల
ద్రుళ్లడపవుగదా దుర్మార్గవృత్తిక
త్యాసక్తినొందు దురాత్మసమితి
యేపుమాపవుగదా నీపాదపంకజ
రతులగలంచు దుష్టయవిభూతి

గాసిసేయవుగదా భూసురక్షేత్రాప
హారదార్ఢ్యసంచారసరణి
శంకిపకుటకు నీతల్లివంకవారో
సేవయించుకలేదొ నీచేతగాదొ
రామధనుఃజవిరామ సంగ్రామభీమ
జానకీరామరవికులసార్వభౌమ. 10

సీ. భరతుడిచ్చినరాజ్య భారకత్వముమాని
కైకకవఖ్యాతిగట్టినావు
తగుభక్తినలసుమిత్రా సూతిని సునమ్మి
జేరిచసన్యాసి జేసినావు
కాలోచితుడవై యకారణంబుగమాటు
పొంచివాలిని సంహరించినావు
జనకాధాట్పుత్రి వాస్తవమెఱుంగుటమాని
తుతగ్నిలోపల ద్రోచినావు
తొల్లినమ్మినవారికి దొడ్డలాభ
మబ్బెనికనేమిగల్గు దురాశగాక
రామధనుజవిరామ సంగ్రామభీమ
జానకీరామరవికులసార్వభౌమ. 11

సీ. దయజూడమంటి నిర్దయవహింపకుమంటి
భవభయభ్రాంతుల బాపుమంటి
కరుణింపుమంటిచొక్కపు నీపదాంభోజ
యుగళంబుదిక్కుగా నుంచుమంటి
పరవధూరూపసంపద్వైభవమునకై
బద్ధానురాగమేర్పరచుచున్న

చిత్తంబునీపదాయత్తంబుగాజేయు
మంటినిదుర్వృత్తినిమాపుమంటి
దురితవారాసి నీపదద్రోణికమున
గడపిదరిజేర్చుటే చాలఘనకుటంటి
రామధనుజవిరామ సంగ్రామభీమ
జానకీరామరవికులసార్వభౌమ. 12

సీ. కృష్ణదాతాయని కీరసమూహంబు
లొప్పారగా బల్కు నొక్కచోట
నారాయణాయని శారికలత్యంత
ముగ్గడింపుచునుండు నొక్కచోట
శ్రీధరాయనిపిక శ్రేణిసుస్వరముల
మక్కువగీర్తించు నొక్కచోట
సర్వేశ్వరాయనిపక్షధ్వనినెమ
ళ్ళక్కజంబుగబల్కు నొక్కచోట
బ్రియముచేకూరనవనిబిపీలికాది
బ్రహ్మపర్యంతమీవయై పరగితౌర
రామధనుజవిరామ సంగ్రామభీమ
జానకీరామరవికులసార్వభౌమ. 13

సీ. మంగళంబిదె నీకుమహిజాహృదుత్పల
పరిపూర్ణచంద్రభూపదివిజేంద్ర
మంగళంబిదెనీకు మానిజాయావాప
ఘోరసంసార వికారదూర
మంగళంబిదెనీకు మహితనీలాంబుద
శ్యామాంగక్రూరదైత్యజనభంగ

మంగళంబిదెనీకు మాణిక్యఖచితని
గ్మలవిరాజిత భూషమంజుభావ
మంగళముభక్తలోల దుష్మదవిఫాల
మంగళము భూతలేశసోమప్రకాశ
రామధర్మజవిరామ సంగ్రామభీమ
జానకీరామరవికులసార్వభౌమ. 14

---

# శ్రీ గుహేశలింగశతకము.

:o:

సీ. శ్రీగుహేశ్వరలింగ చిన్మయశుభ్రాంగ
సర్వదురితభంగ శరణుశరణు
భుజగేంద్రకేయూర భువనత్రయాధార
సద్భక్తమందార శరణుశరణు
హాటకాచలచాపయమిత బాహాటోప
సగుణనిర్గుణరూప శరణుశరణు
పశ్యల్లలాటసంభరిత గంగాజూట
శకలచంద్రకిరీట శరణుశరణు
అభవవరమేశనా నేర్చినట్లునీకు
సీసశతకంబు చెప్పెదజిత్తగింపు
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభ్రాంగశరణుగుహేశలింగ. 1

సీ. శ్రవణంబులకు బల్మిసంభవించినపుడె
శివకథాశ్రవణంబు సేయవలయు
నేత్రంబులకుదృష్టి నిలకడైనపుడె
సద్భక్తనేత్రోత్సవ నలుపవలయు

సర్వేంద్రియములకు శక్తికలిగినపుడె
శివయోగనిద్రఁ జర్చింపవలయు
యొడలిలోఁ బ్రాణంబులుండినపుడె నిన్ను
దెలిసినీపై భక్తి నిలుపవలయు
సర్వధర్మంబులకు దానెసాక్షియౌట
దేహముండఁగ దనుదా తెలియవలయు
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభ్రాంగశరణుగుహేశలింగ. ౨

సీ. పంచాక్షరీమంత్రపరన వ్యాప్తిదమంట
నానందుచరితమే సర్వసాక్షి
రహినాదిమధ్యాంత రహితుండ వనుటకు
శివరాత్రిబ్రహ్మవిష్ణువులెసాక్షి
పరపురుషుడవని పలుకుటకునాన్మహా
దారుకావనా కేళిదనరుసాక్షి
నిత్యుండవీవని సిగముల్పలుకుట
బ్రహ్మకపాల హారంబెసాక్షి
నీవెనిత్యుండవన్యంబ నిత్యమనుచు
మమ్ముఁగొలువంగా నేరరు మేరదప్పి
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభ్రాంగశరణుగుహేశలింగ. ౩

సీ. రమణచంద్రుఁడులేని రాత్రినిబోలుపార
బంధువెన్నెల జిగుల్పరగినట్లు
కమలముల్లేనట్టి కాసారములయందు
వాఃపూరమొగినాడవచ్చినట్లు

మధుమాసముననొప్ప మలయానిలుండును
వనమెల్లంబ్రోవఁగవచ్చినట్లు
ప్రాణనాథుండు దూరబేగివచ్చిన
ప్రణంతికానందంబు ప్రబలినట్లు
లభవనినినుజూడ నానందమావహించె
నెన్నటికివచ్చునో నీదుచిన్నికరుణ
సచ్చిదాకందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభ్రాంగశరణుగుహేశలింగ. 4

సీ. లోచూపుచూడని లోభనంబులవేల
పరమాత్మునెరుగని బ్రదుకదేల
యజపసంఖ్యగనన యనుభవంబదియేల
విషయంబులుండు పనిభవమేల
బోధయెఱుంగనిబుద్ధి యెన్నఁగనేల
కర్తృత్వముడుగని కర్మమేల
యున్మనియెఱుఁగని యోగంబులవియేల
సాక్షియెఱుంగ చదువులేల
యింతకును మాకటాక్షమొక్కింతలేక
కలుగునేయిన్ని ఫలముల గరళకంఠ
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభ్రాంగశరణుగుహేశలింగ. 5

సీ. శంకరుండేమాకుజనకుండు చర్చింప
సర్వమంగళమాకు జననిసుమ్ము
యలవీరభద్రాదులగ్రజులెన్నంగ
బంధుగణంబు సత్ప్రమథవరులు

మానీందు)లందరు మాచుట్టములుసుమ్మీ
వంగడంబల భక్తవర్గమరయ
నీశ్వరుండునుమాకు హితపితామహుడుమా
ప్రపితామహుడు ప్రభురాయడన్న
మోక్షమనునది మాకిష్టుపుట్టినిల్లు
నింకనేమటంగొదువ మాకిందఱుండ
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హరశుభాంగశరణుగుహేశలింగ. 6

సీ॥ యోగనిష్టలులేని భోగంబులవియేల
సద్గుణంబులులేని చదువులేల
పరమాత్మునెఱుగని బ్రతుకదయేటికి
విశ్వేశుగానని విభవమేల
పురహరుఁగొల్వని పూజలెన్నఁగనేల
శ్రీకంఠునుడువని జిహ్వయేల
కాలకాలుఁగనని కాలమెన్నగనేల
తన్నుదానెరుగనితత్త్వమేల
కావునను నన్నుదయసేయుగరళకంఠ
మొనోప్పవిధముల నిన్నాశ్రయించినాడ
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హరశుభాంగశరణుగుహేశలింగ. 7

సీ. పరమేశుదనలోన భావింపకున్నను
జనుఁడుగాఁడిలలోఁ గుజనుఁడుగాని
కలకంఠుకథల నాకర్ణింపనొల్లని
నరుడుగాడతడు వానరుడుగాని

నిన్నాత్మలోఁ గూర్చి నిష్ఠతో నుండని
జీవుండుగాడు నిర్జీవిగాని
యాంతర్యమందు నిన్నర్చింపజాలని
శరణుండనితాఁబి శౌచంబుగాని
కావుననునిన్ను గనని యాకష్టునకును
ముక్తియేరీతికలుగునో మునివరేణ్య
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభ్రాంగశరణుగుహేశలింగ. 8

సీ. మానిహ్వాత్సాంగ సన్మహనీయధవళాంగ
విపులకలుషభంగ వృషతురంగ
శంకలేదుకోటీర సర్వలోకాధార
శమనగర్వవదూర సద్విహార
చపరమపావనగాత్ర భవలతాఘనదాత్ర
వీతిహూత్రసునేత్ర వినుతిపాత్ర
కరుణాకటాక్ష సత్కమనీయవిటలాక్ష
వరభక్తసంగిక్షుగరళభక్ష
శరణుశరణాగతత్రాణ శౌరిబాణ
శరణువరదధురీణ యోశరధితూణ
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభ్రాంగశరణుగుహేశలింగ. 9

సీ. చిలుకలుచదువవా చేరిశాస్త్రంబులు
జదువులఫలమేమి జడమతులకు
భువియెల్లదిరుగవా పొలసిమృగంబులు
దిరిగినఫలమేమి దిమ్మరులకు

ఆహారములుడిసందవలన ఫలమేమి
యుడుగవాహాములీ పుడమియందు
గగనచరుండైన ఘనతయేమరయంగ
గగబారుల్ గావె ఖగములరయ
మానుమంబులెఽ విద్యలుమహిమలెల్ల
గానవివియెట్లుముక్తికి కారణంబు
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశృంగారశరణుగుహేశలింగ. 10

సీ. గురుకులవాసంబు గోరకయున్నను
యోగవిద్యవిధాన మొనరుటెట్లు
దేశికపీఠిగాతిరుగ నేరకయున్న
దగలక్ష్యసాసిద్ధి దనరుటెట్లు
చనుదృశ్యదృగ్వివేచన గానకున్నను
శివయోగసన్నిష్ఠచేయుటెట్లు
శివజీవసంధానసిద్ధి తెలియకున్న
నసిపదంబది తనకనురుటెట్లు
లిన్నియును మీామహాకరుణోన్నతిదశ
లేకకల్గునె దేవయాలోకముననను
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభాంగశరణుగుహేశలింగ. 11

సీ. భక్తుడైశివభక్తియుక్తుడై పరమ
విరక్తుడై సకలవేదోక్తుండగుచు
ధీరుడైఘననిర్వికారుడై విహిత
పంచారుడై కలుషవిదూరుడగుచు

భీముడై నిజసుధాధాముడై కళలందు
సోముడై సకలనిష్కాముడగుచు
నాద్యుడై వేదాంత వేద్యుడై విగతపా
భేద్యుడై తత్వ సంపాద్యుడగుచు
వెలయుసద్భక్తమహాత్మ్యములు గణింప
దరమెపరమేష్ఠికైన మాధవునికైన
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభాంగశరణుగుహేశలింగ. 12

సీ. గడగడవణకుచోఁ దడబడియైనను
నుడువుల మీస్తుతుల్నుడువవలదె
ముదముసుదతుల మదకథాక్రీడఁ
బొదలుచోనినుమది న్వదకవలదె
జిలిబిలిపలుకుల కిడకిలకేరుచో
దలఁపులనినుఁ జాలఁదలపవలదె
వడివడినేఁగుచు నెడనెడనైనను
నుడివడినిన్నాత్మ జూడవలదె
జీవనోపాయమీవని చింతజేయు
భక్తుడాతండు మోక్షసంయుక్తుడతఁడు
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభాంగశరణుగుహేశలింగ. 13

సీ. గండూషజలమునఁ గావింపజలకము
చదవేరుకాదలంజేర్చినావు
శ్రీఫలపత్రముల్ చెప్పుకాలనుగూర
బూజింపశశిమౌళి బూనినావు

మంచిదిగాఁజూచి మాంసఖండంబిడ
మృగముచేత ధరించిమెలఁగినావు
నేత్రమర్పింప నెరిమెచ్చినేత్రిముల్
పదియునైదునునిచ్చి ప్రబలినావు
ప్రౌఢలికన్నప్పదేవునఁ బ్రోచితౌర
యంతవాఁడను గానునన్నరసిబ్రోవు
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభాంగశరణుగుహేశలింగ. 14

సీ. భుజగేంద్రహారాయ భువనాదినాథాయ
భూతేశ్వరాయ కర్పూరనిభాయ
కాలాంతకాయ త్రికాలాగ్నిరుద్రాయ
ఫాలాంబకాయ శుభప్రదాయ
పశ్వల్లలాటాయ భసితాంగరాగాయ
విష్ణ్వర్చితాయ దుర్విషధరాయ
చంద్రకోటీరాయ శైలజారమణాయ
పారిషదేంద్రాయ భవహరాయ
దేవదేవాయనతియని దిక్కుదెసయు
గాఁగభావించికొల్తునో గరళకంఠ
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభాంగశరణుగుహేశలింగ. 15

సీ. పరమేశనేనెంత భాగ్యవంతుండనో
చేతులనిన్ను బూజచేయఁగంటిఁ
ధవళాంగనేనెంతధన్యుండనైతినో
జిహ్వనునీనుతుల్ చేయఁగంటి

భోగిభూషణమెంత పుణ్యవంతుండనో
చేరికన్నులను దర్శింపఁగంటి
వరదనేనెంతటి వ్రతనియమకుండనో
శరణార్థిశివమంట జేయగంటి
యభవమున్నన్ని జన్మంబులందునీకు
భక్తవరుఁడనో పరమపావనుడనైతి
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభాంగ శరణుగుహేశలింగ. 16

సీ. పరమేశయనిబిల్వ పలుకవదేమకో
పలుకవా బ్రహ్మయ్య పిలువగానె
రాజశేఖరరమ్మ రమ్మన్న రావేమి
రావాకో బెజ్జవ్వరమ్మనంగ
లీలకుందాభోగలింగంబు నింటను
గుడుపంగ మాయింటఁగుడువనవేమి ?
నిమ్మవ్వయిటలిమ్మగా బవళించి
మాయింటబవళించ మానెదేమి
హరిదాసుండనే గావవరమహేశ
చులకగాఁజూతురా భక్తశుభనన్ను
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభాంగశరణుగుహేశలింగ. 17

సీ. జయపార్వతీచిత్త సరసిజమార్తాండ
జయనాగలోక భూషణకరండ
జయమన్మదోన్మద జలదసమీరణ
జయసర్వలోకరక్షాధురీణ

జయమహాపాతక సదమలగిరిశంబ
జయభక్తలోకరక్షణ కదంబ
జయదక్షదక్షసంహార జయకల్మషవిదూర
జయభక్తిమందార చారుధీర
జయనిరాకారనియ సంసారదూర
జయసుభాకారభువనైక సద్విహారా
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభాంగశరణుగుహేశలింగ. 18

సీ. పాహిమాంగౌరీశ పాహిమాంసర్వేశ
పాహిసురాధీశ పాహిపాహి
పాహిమాధవళాంగ పాహిభూమిశతాంగ
పాహిహస్తకురంగ పాహిపాహి
పాహిమావిషభక్ష పాహిమాంనిటలాక్ష
పాహిభక్తార్యక్ష పాహిపాహి
పాహికృతాంత పాహిభవాంతక
పాహిపురాంతక పాహిపాహి
పాహిపాహియటంచు నేబ్రస్తుతింతు
నింపుగానాదు కుయ్యాలకింపుమయ్య
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరసుభాంగశరణుగుహేశలింగ. 19

సీ. వందేమహాదేవ వందేసదాశివ
వందేమహానంద వందనంబు
వందేభవానీశ వందేపురాంతక
వందేభవాంతక వందనంబు
వందేజగన్నాథ వందేసితిగ్రీవ
వందేగణప్రియ వందనంబు

వందేవిరూపాక్ష వందేసురార్చిత
వందేదిగంబర వందనంబు
వందనమూహారనీవాడ వందనంబు
మంగంబయనీకు నమస్కరింతు
సచ్చిదానందసద్గుణైశ్వర్యబృంద
హీరశుభాంగశరణుగుహేశలింగ. 20

# రుక్మిణీపతిశతకము.

—:o:—

ఉ. శ్రీకరవల్లవీజనవశీకర భూరికృపాకటాక్ష ర
త్నాకరయాదవాన్వయ సుధాబ్ధినిశాకరదుష్టశత్రుహృ
ద్భీకరముష్టికాద్యసురబృంద నిరాకరమిత్రహంసపద్మాకర
కల్పితత్రిజగదండ చమత్కృతిరుక్మిణీపతీ. 1

ఉ. శ్రీతరుణీకళత్రసరసీరుహ నేత్రపురారిమిత్రవి
ఖ్యాతచరిత్రనీలఘనగాత్ర విహంగమపత్రపాతక
వ్రాతలతాలవిత్రసురవైరి వనోత్కటవీతిహోత్రసం
న్యూతచరాచర ప్రభవసూత్రదోయామతిరుక్మిణీపతీ. 2

ఉ. శ్రీరమణీవిహార భవసింధుజలప్లవతారశత్రుసం
హారగుణైకవీర నిగమాగమసారత్రిలోకరక్షణో
దారసురారిదుర్మదవిదార రణాంగణశూరగోపికా
జారుసుమేరుధీరసురచారుణ సన్నుతరుక్మిణీపతీ. 3

ఉ. రామకృపాభిరామ రిపురాజవిరామధరామరాండజా
నామసరోజదామద్విజ రాజమలార్ష్ణవపూర్ణసోమని
ష్కామసమస్తదేవ గణసంస్తుతనామగిరీంద్రధీరతా
నేమసునామచ కజనసేవ శుభాకరతిరుక్మిణీపతీ. 4

ఉ. పరమకృపాకటాక్ష భవభవంధవిమోచన దీక్షదుర్మదా
సురకులాశిక్షదివ్యమణిశోభితహార విశాలవక్షభూ
సురపరిరక్షమానిజనసువ్రత పాలనదక్షభూరిభీ
కరవిపినాగ్నిభక్షకరికంఠ సుతీసుతిరుక్మిణీపతీ. 5

ఉ. గోపకుమారమార శతకోటిసమాన విలాసరాసకే
ళీపరిసంగసంగత కళిందసుతాత్మవిహారహారసం
దీపితవత్సవత్సముఖదేవవిరోధి విఘాలఘాలదృ
క్స్వాపభూమభూమహిత భక్తజనాదృతిరుక్మిణీపతీ. 6

ఉ. శ్రీపతియంజనాపతి శచీపతిరైవతిశైలరాజక
న్యాపతిరోహిణీపతి బృహస్పతివాక్పతి గోపతీప్రపు
త్రీపతిపద్మినీపతి ఝురీపతిభోగపతిస్స్వధాపతీ
డాపతియామ్యాదికృతిదృష్ట సుతివాక్కృతిరుక్మిణీపతీ. 7

ఉ. జయజయదేవకేజర రసాగరపూర్ణవిశోధినీధవా
జయజయవల్లవీహృదయ సారసతామరసాఘబాంధవా
జయజయదుష్టశత్రుకుల శాసనకృత్ఖగరాడ్వైసైధవా
జయజయనారదాదిముని సంఘసమాశ్రితరుక్మిణీపతీ. 8

ఉ. మామకచిత్తమందు నిలుమా పలుమాటలుమాభక్తచిం
తామణి నిన్నువీడగలనాయిలనావలనాధులెవ్వరు
ద్ధామదయాసముద్రకలదావలదాసలదాటుద్రోయ సు
త్రామకుజాపహారఘనతాజసతాసతిరుక్మిణీపతి. 9

చ. జలజభవాది జంతుగణసంయుతమైన జగంబుమ్రింగియా
ప్రళయపయోధిమధ్యమున బాలుడవై వటపత్రసీమరం
జిలశయనించి పాదమొకజేగొని యాస్యమునందుజేర్చిచుక
కిలకిలనవ్వునీకపుడు కేలుమొగడ్చితిరుక్మిణీపతీ. 10

ఉ. రోటనుగట్టతల్లినెదరోయిక నాపులగుంపుగాయ నే
ర్పాటుగబంపుతండ్రి జలపట్టిపెనంగెడు గోపబాలుర

జూటుతేనంబునన్ బదరజూచిన వ్రేతెలనాదరించు
నీపాటిదయాళులెవ్వరని వాటదలంచితిరుక్మిణీపతీ. 11

చ. సుదతులునీటదోగుతరిచూచి హుటాహుటితోటిబాలురన్
కదలకుడంచు పూబొదలుకందువనొయ్యనపొంచి స
మ్ముదమున వారిపుట్టములు మ్రుచ్చిలియచ్చటిపొన్నలెక్కనీ
పదములబట్టి బంధములబాయకగొట్టితిరుక్మిణీపతీ. 12

చ. కరమున వేణునున్ను నుటకస్తురిబొట్టుముక్కుముత్తియం
బురుతనుకౌస్తుభంబు పిగనందపుపింఛము మేనచందనం
బురయగదాల్చిగోపికలందరికందము జూపినట్టినీ
సురుచిరమూర్తిజూపుమిదే జూడకోరితిరుక్మిణీపతీ. 13

ఉ. లోకములెల్ల నీకడుపులోపలనుండగ లోకరక్షణా
లోకపతత్పరుండవయి లోకములోకమనీయ్యగోపికా
లోకసుఖానుషంగమెదలోగమియించితివంచు పావకా
లోకముఖామరవ్రజములో గురికొల్చితిరుక్మిణీపతీ. 14

ఉ. నీమధురోక్తి నీనెఱునీదరహాసము నీవిలాసమున్
నీమహనీయ్యవైభవము నీసుకుమారత నీమనోహర
ప్రేమ కరావలోకనమభీష్టములొందగజేయునీదు లీ
లామహిమంబుజూపు మిగులంజలపట్టితిరుక్మిణీపతీ. 15

ఉ. శ్రీరమణీసమేతముగ క్షీరసముద్రమునన్ మహోజ్వలో
దారభుజంగరాణ్మృదులతల్పమునన్ సుఖలీలమోగని
ద్రారతిపవ్వళించి యఖిలంబునులోగొని నీనిజోదారాం
భోరుహనీమమున్నలువపుట్టువొనర్చితిరుక్మిణీపతీ. 16

ఉ. యెవ్వనిమాయచే జగములెల్లజనించు వశించులీనమౌ
నెవ్వనిరూపమిట్టిదని యేర్పడవేదములెన్నలేనివా
నెవ్వనితత్వముం దెలియ జెప్పను దేవతలార్తులౌదురే
నవ్విభునిందలంతు తనుమారుశాపుతిరుక్మిణీపతీ. 17

చ. అనిశమునీపదాబ్జయుగళార్చన సంస్తుతిభక్తియుక్తులా
ఘనులతిదుర్భరార్ణవముదాటి తరించివిరించిశంకరాద్య
నఘులకరానిపదమందు దురంచుసనందనాదులే
న్నినపరతత్వము నీవనుమనీష జెలంగితిరుక్మిణీపతీ. 18

ఉ. పాపములెల్లబాపుకృపామతి జూవుముతావకీయ్యమా
రూపముపూర్వసంచితని రూఢగతాగతకర్మజాలసం
తా ముదూలిముక్తిలల నాకలనాపరిరంభసంభ్రమా
టోపముకొంగుముల్లెడ కనుంగొనబేర్చితిరుక్మిణీపతీ. 19

ఉ. కంటినినీపదాబ్జములు గట్టిగపట్టునేర్పునే
వింటినినీచరిత్రములు వీనులకింపు జనింపుసొంపుదై
కొంటినితొంటిజన్మమున గూర్చినపుణ్యమగణ్యవృత్తిము
క్కంటినిబ్రోచునీనెనరుగాంచి సుఖించితిరుక్మిణీపతీ. 20

చ. నగధరకృష్ణకేశవజనార్ధన మాధవవాసుదేవప
న్నగపతితలశౌరిహరినారదవంద్య జగన్నివాసంజి
హగరిపువాహచక్రధర వామనరాఘవశ్రీనివాస స
రగకమలాక్ష నీపదముప్రాపనిడాసితిరుక్మిణీపతీ. 21

చ. దరిచెడివహ్నికై కారవిదయ్యము మెటనరుంగుచాడ్పునన్
సిరిగలవానిచేరువకుచేరి ధనేభనుదీనవృత్తిచే
దిరుగుచువ్యర్థుడై పిదప దేహముబాసిమహోగ్రకాల
కింకరదళితాంగుడై నరుడు గానకునిర్వృతిరుక్మిణీపతీ. 22

చ. అనవరతారవంజవ మహాంబునిధిన్ దరియింపనీదు
పావనమగునామమున్ దగిధృవంబుదరింబడ ద్రోయునంచున
మ్మనకలదేభయంచనితమిన్ దలపోసిహరీహరీఅని
నినుబల్కనాదురసనాగ్ర సరస్వతిరుక్మిణీపతీ. 23

ఉ. పాయకపుత్రమిత్రపశు బంధుకళత్రధనాభిలాత్తున
హేయసుఖంబుల దగిలిహీనమతింనిజదేహగేహ

మోహాయచిత్తుఁడై మనుజుఁడజతనీపద సేవలేశమున్
జేయకనంత్యకాలమున జెందునధోగతిరుక్మిణీపతీ. 24

ఉ. నీపదనీరజమ్ములకు నిర్మలభక్తినమస్కరింతునా
యాపదలెల్లబాపుము దయాపరమూర్తి నిజశ్రితాఘసం
తాపదవాగ్నిసంహరణదక్షకటాక్ష సుధాప్తిమోక్షలక్ష్మీ
పదపాత్రుసేయుటకు చేకొనుమోంవ్రతిరుక్మిణీపతీ. 25

చ. గతజలసేతుబంధనము కాగలదేమనిదీనవృత్తినే
కతమభవన్నదేహమున కాపుహరియని వేడినాడనీ
వితతదయాధురీణతకు విశ్వతికల్గజేయరాదె
కతమున నామొడ న్గొంగతకన్పడెనీతతిరుక్మిణీపతీ. 26

చ. జగముకలిప్రపీడయుగసంధిని సంకరమైనదోర్భుజాయుగ
మునమండలాగ్రయుగమూని హటాహటిసాదివై దిశల్
బెగడకిరాతులన్నరికి భీకరవిక్రమచండమూర్తివై
నెగడెడికల్కినిన్ను గనునిర్మలుజేకృతిరుక్మిణీపతీ. 27

ఉ. అంచితమైనమిత్రకులమందుజనించినినిశాటతాటకన్
దెంచిధరాతనూజనువరించి కనిన్వసియించి వార్ధిభం
ధించిదశాస్యుద్రుంచి కరుణించి విభీషణురాజ్యయుక్తుగా
వించినరామమూర్తిని వేమరువేడితిరుక్మిణీపతీ. 28

చ. తనువనునాశయందు వశదంబుగుహ్యధ్వజమూనియేదు సే
వనపుదృఢాంబరంబు తెరవట్టిభవన్మను నిష్టయన్ప్రభం
జనగతిజ్ఞానమార్గమున సంసారాంబుధిదాటిముక్తి
గైకొనిసుఖియించనిన్నదను గోరివసించితిరుక్మిణీపతీ. 29

ఉ. మంగళమందిరారమణ మంగళమంబుజపత్రలోచనా
మంగళమంగజావినుతమంగళ మబ్జభవాడపాలనా
మంగళమందిదేవహరి మంగళమభ్రగరాజవాహనా
మంగళవాంఛనీకిది మంగళహారతిరుక్మిణీపతీ. 30

ప్రథమభాగము సంపూర్ణము.

శ్రీ సత్యానందప్రెస్, ఇన్నీసుపేట, రాజమండ్రి.

# శతకరత్నములు

( మూడవ భాగము )

పండిత మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రిగారిచే

సంగ్రథితము.



పబ్లిషరు:—

కొండపల్లి వీరవెంకయ్య

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

రాజమహేంద్రవరము:

శ్రీ సత్యానందప్రెస్ నందు

ముద్రింపఁబడినది.

1930.

 [వెల 1—0—0

# విషయసూచిక.

—o—



# శతకరత్నములు.



మూడవభాగము.

## తాడిమళ్ల రాజగోపాలశతకము.

———:o:———

సీ. నాథునికస్తూరినామంబు గనుగొని
కలికియెవ్వతెహానిగాఁగలించె
దక్కుచునాయింటి దగ్గరరాకుండ
మాటునఁబెట్టిన మగువయెవతె
పోయియూపనుల కొప్పించినదెవ్వతె
దానికినాయుసుర్తగులుగాక
దోసముంచెన్నక దుముకులాడెవ్వతె
మన్ననగావించి మరులుగొల్పె
గీ. దానికోరికలీడేర్చు దైవమిపుడు
యెంతయూసక్తితోనున్నదింతగదవే
తరుణినీవేగియిచటికి తాఁడిమళ్ల
రాజగోపాలుదేగదేరాజవదన. 1

సీ. సన్నజాజులసొబగెన్న నేమిటికినా
పతినన్ను విడనాడిపల్కునపుడు
రమణిరోకృష్ణుడు రాడాయెననిమది
తల్కుచీరెయుగట్ట దలపురాదు

వనితరో నాయేఁడు వారాలసొమ్ముల
బరిణేనిప్పను నాకుభ్రాంతిలేదు
ఆభరణాలకృతాంగినై యెనున్న
ఫలమేమికృష్ణుఁడు వలచిరాఁడు
గీ. ఎన్నిసొగసులుగలిగిన నేమిఫలము
కలికికృష్ణుఁడువచ్చుటగాదె సొమ్ము
తరుణినీవేగియిచటికి తాడిమళ్ల
రాజగోపాలు దేగ దేరాజవదన. 2

సీ. పద్మగర్భునివా ్రిత బరిహారమొనరింప
వశముటేయెంతటివారికైన
జగతుడై యాబ్రిహ్మ బలవంతమునఁనన్ను
కుత్సితునకునేల కూర్చెనమ్మ
వేషధారికినేను వెలదినై యుండఁగ
సుదతిరోసంసార సుఖమెరుంగ
మునునీవీరీతు లన్నియుజూచిన
యప్పుడేగాదని చెప్పనైతి
గీ. ననుచునీవేళ నామాటలడిగిరాద
లంచినమని నినుబిలపించిటింతే
తరుణినీవేగియిచటికి తాటిమళ్ల
రాజగోపాలు దేగ దేరాజవదన. 3

సీ. అతనికియేమేమి నానవాలంటివా
వేణువుదనచేత బూనినాఁడు
రహిఁనొప్పశంఖచక్రంబులు గలవాఁడు
సఖియ శ్రీవత్సలాంఛనమువాఁడు

కోమలినవరత్న కుండలంబులవాడు
కస్తూరితిలకము గలుగువాడు
నలినాక్షిస్త్రీలలో నవ్వుచుండెడువాడు
కమనీయజీనితి కాంతివాడు
గీ. యిన్ని సొగసులు గలిగినవనేము
దెలిసినవర్తమానము దేటపరచి
తరుణినీవేగియిచటికి తాడిమళ్ల
రాజగోపాలుదేగదేరాజవదన. 4

సీ. కమలాక్షియడవిలో గాయువెన్నెలరీతి
నాతడుసరసము లాడడాయె
గూరిమినాముదగూర్చుం యపుడైన
నింతినాకొక్క ముద్దియ్యడాయె
బడతినేరమ్మని బ్రితిమాలినపుడైన
నగరుగంధము మేనలదడాయె
నోరాధికాయని యూహించియెపుడైన
బీ్రితితోనన్నుతా బిల్వడాయె
గీ. నరయనామదిజింతచే నుండజేసె
మానితంబుగ కృష్ణునిమనసురాదు
తరుణినీవేగియిచటికి తాడిమళ్ల
రాజగోపాలుదేగదేరాజవదన. 5

సీ. లంచమియ్యకనురావించ బొమ్మనివాని
నప్పుడేయేమైన నడుగనైతి
మొలకనవ్వులముద్దుమోము జూచినఅంత
నాతనిగుణములే నరయనైతి

మాతల్లిదండ్రుల మాటలాలింపక
కుటిలబుద్ధినిగూడి కొలువు పోతి
వేగిరపడినేను వేడుకొనినగాని
సవతిపోరునునే జడియనైతి
గీ. కొమ్మనాబుద్ధికేమను కొందునమ్మ
వలపుమనమాయె నోర్వనావశముగాదె
తరుణినీవేగరించుటకే తాడిమళ్ల
రాజగోపాలుదేగ దేరాజవదన. 6

---

అచలబోధామృతమను

# నామరహితాచలశతకము.

——:o:——

క. శ్రీమీరుయచల గురుడను
రామడుగున బుట్టినట్టిరత్నమునెపుడున్
పేర్మితోశివరామాహ్వయు
వేసురుపూజింపుచుందు వేడుకలూరన్. 1
క. గురువర చచ్చుచుబుట్టుచు
పరిపరిబాములను జెందిపాపాత్ముడనై
నరకమునబడెదనుననుసీ
దరిజేరిచి బ్రోవవయ్య దాక్షిణ్యనిధీ. 2
క. జననము మరణములొందక
ననయమునొకరీతినుండు నట్లుగనాకున్
ఘనమగుసద్గతి మార్గము
వినజేయుము పుణ్యపురుష వేగమెకృపతోన్. 3

క. పరిపూర్ణము బయలనగను
గురుగుహ్యమనంతమనగ గోప్యంబనగన్
థిరమనగనచలమనగను
యరయము ఇవియన్ని బ్రహ్మమంచునుమదిలో. 4

క. జననము మరణములేకను
యనయమునొకరీతినుండి యన్నియుతానై
థిరమగునది యీబయలే
పరిపూర్ణంబంచునమ్ము బాలకయింకన్. 5

క. పెరుగుట విరుగుటలేకను
పెరిగేవిరిగేటిమాయ పేరేవిడకన్
కరగక చదరక వదరగ
నరయకమరియుండునదియె యచలంబగురా. 6

క. దేహమును జూచినీవతి
మోహముజెందేవునీవు మొదటిదివినుమా
దేహముకాలినమీదట
మోహముజెందంగగలవె ముదమునజెపుమా. 7

క. నీరూపము నీవెరిగిన
నారూపితదేహమింక నరయుటకేదీ
మారూఢిపలుకనేర్చిన
యారూఢిగజడత దేహమచలములోనన్. 8

క. ఇంతట నంతగాకను
యంతట బ్రహ్మంబెయంచు నరసినతెలివిన్
యింతైనమదినినిల్పిన
చింతబడిపోయినీవు చెడుదువునుమ్మా. 9

క. ఘనమగు మిరముసూర్యుని
గనినీరూపమున కాంతిగడు హెచ్చుజుమీ
యనిపరిహాసమునేసితి
ననసేర్చువెల్గుతోటి నచలములోనన్. 10

క. తారకమె గురుడు దెల్పిన
నూరకముద్రలన బట్టినోంకారమునన్
సారెకుజపియించుటకును
నోరెవరికివచ్చునయ్య నూహింపవడిన్ 11

క. తానసనెడివాడు యెవ్వడో
తానెరుగక మీదిమాట తలచుటతగునా
తానీయచలములోపల
తానేలేకుండబోయె తప్పకగనుమా. 12

క. తన్నెరుగని జపమేలను
తన్నెరుగనియాత్రలేల తామసమేలా
తన్నెరుగని చదువేలను
తన్నెరుగని తత్వమేలతానెరుగుటకున్ 13

క. తానేయరిషడ్వర్గము
తానేభూతంబులైదు తనువున్ తానే
తానేమనసును బుద్ధియు
తానేయాదిత్తమందు తానెరుగవలెన్. 14

క. తానేతత్వము లన్నియు
తానేవేదంబులెల్ల తానేక్రియలున్
తానెకర్తయు కర్మయు
తానేస్త్రీరూపులన్నియు తానెరుగవలెన్. 15

క. అదినాదిదినాదనకను
అదినేనిదినేనటన్న యాశలులేకఁ
మొదలుటచెదలుటెరుగక
పదిలంబుగనుంటివేని బ్రహ్మమునీవే. 16

క. నీపలుకును నీమనసును
నీపనులునుగురునివంచు నీహంసనులే
నాపకగురునికి యొసగిన
నాపరిపూర్ణంబు జూపునర్షముతోడఁ. 17

క. కొందరుగురువుల మంచును
పొందుగశిష్యులకుఁ పూర్ణబోధలుసేయన్
యిందందు దిరుగుచుందురు
విందులుమరియారగించి వేత్తలమంచుఁ. 18

క. ఇందందు దిరుగువారల
డెందములల డబ్బుయందేక్షీకొసియుండేఁ
యెంద్రైనిట్టికుచ్చిత
చందంబులదిరుగువారు సాధులెజెపుమా. 19

క. ఈమతులుకొందరు గురువులు
సమభావమంచు శిష్యసంపన్నులకుఁ
తమనోటియెంగిలన్నము
మమతతోతినుడంచుబెట్టు మాయాస్పదులై. 20

క. మఱియున్కొందరు గురువులు
పరిపూర్ణులుతమ్ముజూపి ప్రస్థాపింపన్
మఱియాదదక్కంచని
నెరిగేమియు బల్కకుందురెంతోనిష్టన్. 21

క. మరియుఁగొందరు గురువులు
గురులకుపరిచర్యజేసి గోప్యంబగునా
పరిపూర్ణబోధవడసిన
నరులకెమోక్షంబటంచు నందుసుమ్మా. 22

క. ఇనుజూడనేగిచీకటి
గనుగొనిం తైన లేనికరణినిభువిలో
ఘనమతిమంతుడు శిష్యుడు
తనగురునిగాంచినంత తానేబ్రోవున్. 23

క. గురుడును పామరనరుడును
నరయుగనొకరీతినుండు నజ్ఞానమునన్
వరచక్కరకర్పూరములు
పరికింపగనొక్కరూపుపనిభేదంబుల్. 24

క. తానేగురుడునుశిష్యుడు
తానేశాస్త్రంబులెల్ల తానేశ్రుతులున్
తానేయుక్తులుశక్తులు
తానేతనరూపులేని ధన్యుడుసుమీ. 25

క. తానే నీవును నేనును
తానేతగచక్రవర్తి తానేరాజున్
తానేమంత్రిలు భటులును
తానేసర్వంబటంచు తానెరుగవలెన్. 26

క. సాధనములేనిబోధని
సాధులుపెక్కండ్రు దీనిసాధించిరియే
సాధనలబ్బిన నచలము
సాధింపగజాలవీవు సమరసబుద్ధిన్. 27

క. తరమాతన రూపముగన
తరమాబ్రహ్మంబునందు తానవిపల్కన్
తరమాహంసను గనుగొన
తరమాసద్గురుని మహిమతానెరుగుటకున్. 28

క. తననామరూప నటనలు
ఘనమగు యీబయలునందు కనబడెనేనిన్
తనుబ్రహ్మననుట జెల్లును
కనవినలేనట్టివానికగునే బల్కన్ 29

క. నేనాబ్రహ్మనటంచును
యేనాడిల దెలిసినావొ యికయంతటితో
నీనామరూపనటనలు
యీనాడే సున్నసుమ్ము యచలమునందున్. 30

క. పరిపూర్ణమంత దెలిపెడి
పరియంతము గురుని కెంతో భక్తుండనుచున్
తరువాతగురునిగాంచని
నరుడేపరిపూర్ణుడనుచు నమ్ముమువత్సా. 31

క. పరిపూర్ణభావయుతుడని
గురుతేమియు లేనివాడె గురువరుడగుయా
నరులెట్లు నెరుగజాలుదు
రరయంగను వెల్గుజూడ రాతిరితరమా 32

క. అబ్బురమగు పరిపూర్ణము
నిబ్బరముగ గురుడు దెల్పనికయంతటితో
శెబ్బరగు మేను జగములు
నెబ్బంగిని నెరుగబోకు నీబయలందున్. 33

క. రాగలవృకీడమేలులు
పోగలవృతమంతతామె పోడిమిచెడియీ
రాగద్వేషములేలను
కాగలకార్యంబుజూడు కడుశీఘ్రమునన్. 34

క నేనున్ననుధనముండును
నేనేలేకుండబోతె నేదికధనమా
నేననుటమాయయేగ
నేనుమామెమిలేదు నీబయలందున్. 35

---

# సాంబమూర్తిశతకము.

:o:

సీ. శ్రీపార్వతీమనశ్చిన్మయాంభోజాతసతత
చరద్భృంగ చారుమూర్తి
సరసీరుహాసన స్వారాజరాణ్ముఖ్య
సకలాదితేయ వాంఛాసుపూర్తి
సర్వచరాచరఖర్వవిస్ఫూర్జిత
భక్తపాలన ఘనభవ్యకీర్తి
భవదీయపదపద్మ భజనతత్పరచిత్త
భక్తపాలన ఘనభవ్యకీర్తి
గీ. యసమసురవైరి దితిజరాజసమర్తి
సదమలాఖిలముని రాజహృదయవర్తి
చెలఁగుకృపతోడ మమ్మురక్షించుకీర్తి
సంతతాహ్రాతసుజనార్తి సాంబమూర్తి. 1

సీ. శ్రీకరబహువిధ శ్రేయోంచితాకర
పరిపాలితామరభక్తనికర
సకలగుణోత్తర సత్కంజదినకర
శరదుజ్వలాంబుద పురపురహర
సజ్జనావనపరసంతతహితకర
మాళీకృతసుధాసమంచితకర
భక్తారిసంహార భక్తవశంకర
శంకరిసన్మునిజనశుభకర
గీ. నిన్నె సతతంబు నమ్మితినిర్మలాత్మ
కానకావుముమమ్ము సత్కరుణమీఱ
భక్తవరదుఁడవీవు నేభక్తవరుఁడ
సంతతాహ్లాదసుజనార్తిసాంబమూర్తి. 2
సీ. కుండలాజ్ఞేయించుకొంటిని జెవులను
నివిదాల్పఁగుట్లు నేనెట్లుదెత్తు
మాధూకరంబెత్తి సాధించితినివిద్య
శాస్త్రపద్ధతుల నెచ్చటనుదెత్తు
నాభరణంబుల నన్నియుంచితిఁగాని
తొడఁగినరూపమెక్కడనుదెత్తుఁ
గలబుద్ధులన్నియుఁ గఱపినేఁగాని
యెంతయుసన్మతి యెట్లుదెత్తు
గీ. ననినయట్టులనల్పున కవనినాథు
చెంతనుద్యోగమబ్బినఁ జెడుగుణములె
కానిమంచిగుణంబులు గలుగునెట్లు
సంతతాహ్లాదసుజనార్తిసాంబమూర్తి. 3

సీ. నీచాత్మునర్థంబు యాచించుకన్నను
ప్రథితాత్ముచే నల్కపడుట మేలు
అన్యులమతిఁగోరు కన్యగల్గుటకన్న
క్షితిమీదన వివాహితయె మేలు
తనమేలునోర్వని యనుజులుండుటకన్న
నసహిష్ణులౌనన్యులైన మేలు
ధనమున్న దుష్పాత్ర వినియోగమగుకన్న
నరయఁగా నిర్ధనుండైన మేలు
గీ. పరిజలఁబ్రోవని నృపుకన్నఁ బరుఁడు మేలు
అల్పుఁడౌ మంత్రికన్న లే నతుఁడు మేలు
లేతయధికారికన్న బంట్రోతు మేలు
సంతతాహ్వాతసుజనార్తిసాంబమూర్తి. 4
సీ. చిన్నధికారంబుఁ జేయునల్పుండును
బెద్దయు నేకీభవించెనేని
బానిసెపనిఁజేయు పౌరుషహీనుండుఁ
బెద్దయు నేకీభవించెనేని
నుల్లిపాయమ్ముక యూరూరఁదిరిగెడు
వాఁడునువీఁడును గూడెనేని
నింటిలోదనకాంత కిష్టుఁడైనట్టియ
వాఁడును వీఁడునుగూడెనేనిఁ
గీ. బరిజలనఁగదగిన ప్రజలకుఁ బ్రబలుసుఖముఁ
బ్రభువునకుఁగల్గులాభంబుఁ బ్రబలియశము
నితనికిఘటిల్లు ప్రతిభయు నేమిచెప్పె
సంతతాహ్వాతసుజనార్తిసాంబమూర్తి. 5

సీ. అధికారమదమున బధిరాంధతలుగల్గి
మూఁదమందసహజంబ కదమఱివిను
సభలోనఁగూర్చుండి సభ్యులనాడుచు
నితరుల నెన్నుచు నెన్నఁబడుచు
నతివాక్ప్రగల్భంబు లాడుచునిటునటుదిరుగుచు
నధికారతృప్తిఁగొనుచు
వెధవలెక్కలటంచు విసుగుచుఁదమకిచ్చు
నట్టివి వెధవలె? యనఁగఁబడుచు
గీ. మఱియుఁగొందఱుదూరెన శిరమువంచుకొనుచుఁ
గొలువుండునధికారిశ్రేణియందు
జెడిబ్రతికినట్టివాఁడని చెప్పవలదె
సంతతాహ్వాతసుజనార్తిసాంబమూర్తి. 6

సీ. జననీజనకులకు సత్కీర్తిఁదేనట్టి
కొడుకుగాఁడతఁడు తుందుడుకుకాని
సత్కార్యమొనరింప సంతోషపడనట్టి
జనుఁడుగాఁడతఁడు దుర్జనుఁడకాని
విద్యావిహీనుఁడై యుద్యోగియగువాఁడు
పశువె? కాదతఁడుకాళ్ళపశువుకాని
న్యాయకార్యంబు నన్యాయంబుగాఁ
జేయునధికారి కాడధికారికాని
గీ. యిట్టిజనములు పుడమిపైఁబుట్టనేల?
పుట్టినీభక్తులను బాధపెట్టనేల?
పెట్టిభవదీయకోపాగ్ని గిట్టరేల?
సంతతాహ్వాతసుజనార్తిసాంబమూర్తి. 7

సీ. తల్లికిఁదండ్రికి దగుకీర్తిఁ దేకుంటె
నున్నట్టులుంచిన నొక్క మేలు
సత్కార్యమొనరింప సంతోషపడకుంటె
నుర్విఁ జెఱుపకున్న నొక్క మేలు
విద్యాప్రసంగముల్విన దెల్వి లేకుంటె
నుద్యోగి కాకున్న నొక్క మేలు
న్యాయవిచారణఁ జేయఁగా లేకుంటెఁ
జక్కనుపేక్షింప నొక్క మేలు
గీ. ఇన్ని మేళ్లువిచారించి యోజనుండు
కంటకుఁడుగాక సన్నుతింగాంచు నేని
తెల్విగలసజ్జనుండని తెలియవలయు
సంతతాహృతసుజనార్తిసాంబమూర్తి. 8
సీ. తప్పుస్పష్టులొనర్చి తలవంపుపడుకంటె
నింటింట యాచించుకొంట మేలు
కడపటనన్నృతవాక్యంబు లాడుటకంటె
జాలలేనని బ్రతిమాల మేలు
తా బెదారునితోడఁ దగినవైరముకంటెఁ
బలుపురువెట్టు ఛీవాట్లు మేలు
ధనికుడై యుండి యధర్మాత్ముఁడగుకంటె
నవనిపై నిఁదరిద్రుఁడైన మేలు
గీ. ఒకనిపైఁ గిన్కనొకరిని వికలపఱచు
వానికంటెను దాసినైనను మేలు
చాడిఁజెప్పుటకంటెను జలము మేలు
సంతతాహృతసుజనార్తిసాంబమూర్తి. 9

సీ. సంకరజాతులు సభఁబూజ్యులై యుండి
రుత్తమకులజులు రిత్తపడిరి
శాలిధాన్యముల్దిని చపలులై యుండెడి
వారలుపూర్ణాధికారులైరి
పల్లెలువెంబడిఁబడి జీవనముఁజేయు
జనులుమహారాజ సచివులైరి
చెవులలోఁగలముంచి చెలఁగెడివారలు
సంతర్పణాలవెంటఁ జనుచునుండి
గీ. రహాహాకల్యాది సకలవర్ణాశ్రమంపు
ధర్మములుపోయి జనులన్యకర్ములైరి
ముందెటులనౌనొకద భక్తిముక్తిదాయి
సంతతాహృతసుజనార్తిసాంబమూర్తి. 10

సీ. చిననాటినుండియుఁ దనయింటివస్తువుల్
గొనిపోయియమ్మక కొంతడబ్బు
తప్పుసృష్టిలొనర్చి తలవంపులకునోర్చి
కూటసాక్ష్యముఁబల్కి కొంతడబ్బు
పదియిచ్చినాటికిఁ బత్రముల్వ్రాయించు
కొనిపుచ్చుకొనినట్టి కొంతడబ్బు
చెడునడవడిచేత సిగ్గరిలంజల
కొన్నివస్తువులమ్మి కొంతడబ్బు
గీ. కూడబెట్టకమతిమంచి గుడ్డకొనక
జ్యేష్ఠులసుఖంబు నోర్వక చెరుచుననుజుఁ
డుండెనేమి? గాడాగ్నిచే మండెనేమి?
సంతతాహృతసుజనార్తిసాంబమూర్తి. 11

సీ. జరుగునట్టికొలంది యురువటియుండుట
చదువుకొలఁది నిస్సంగుఁడగుట
ధనవృద్ధికొలఁదిని ధర్మంబుసేయుట
జ్ఞాతిబాధకొలంది శాంతుఁడగుట
యధికారముకొలంది న్యాయంబుబూనుట
పొగడుకొలంది సమ్మోదమువిడుట
పేర్మించుకొలఁదిని బిగియకయుండుట
చనువిచ్చెడికొలంది సభయుఁడగుట
గీ. యననుభావ్యములైన దద్వృత్తయములఁ
బూనకుండుటతగుసాధ్యమైనవరకు
భక్తవాంఛాసుపూర్తి సోభవ్యకీర్తి
సంతతాహ్వతసుజనార్తిసాంబమూర్తి. 12
సీ. పూటకూటికిలేక పొరుగూళ్ళఁకేగుచు
జెలిమిచుట్టరికముల్ చేసికొనుచు
సత్రంబులందు విచిత్రవైఖరితోడఁ
బాచకులకుఁదోషు పాటుపడుచు
గొప్పయుద్యోగుల కొంపలఁగలయట్టి
పనులుచేయుచుఁజాలఁ జనువుఁగొనుచు
సంతర్పణంబుల సహాకారమొనరించి
గాడిపాద్యాలచెంతఁ గడిఁగుడుచుచు
గీ. జెలఁగిమీసలదువ్వుచు సిగ్గుమాలి
తిరుగువారలనెట్టనితీర్పవచ్చు
భక్తవాంఛాసుపూర్తియోభవ్యకీర్తి
సంతతాహ్వతసుజనార్తిసాంబమూర్తి॥ 13

సీ॥ కామినిభర్తతోఁ గయ్యంబులాడుట
పుత్రుఁడుతండ్రితోఁ బోరుగొనుట
బంటునృపపతితోడఁ బంతంబులాడుట
నీచుడధికుతోడ నేస్తపడుట
గురువునుశిష్యుండు పరిహాసమాడుట
దాసిపోషకుతోడఁ దగవుపడుట
రాజాధికారి ప్రల్లదములాలించుట
ప్రగ్గడల్ప్రజలవైరంబుఁ గొనుట
గీ. లంచమధికాధికారి గ్రహించుటయును
కూటసాక్ష్యంబులివ్వఁగాఁ గూడికొనుట
దలఁపవచ్చును గలికాలధర్మములుగ
సంతతాహ్వాతిసుజనార్తిసాంబమూర్తి. 14
సీ. ఇలువెళ్ళినీకార్యమేను సేసెదనంచు
నమ్మించి చెడఁదీయు నరుఁడొకండుఁ
దానుచేసినయట్టి తగుశాసనంబును
వేఱుగామార్చెడి వీరుఁడొకఁడు
నొకభంగికార్యమందొనరించు తీర్పువే
ఱొకనికిఁగాదనుచుండు నొకఁడు
నీవాచరించినట్లేను జేసితిఁగాని
న్యాయంబుఁ జూడలేదనునొకండు
గీ. నిట్టిపావుల కధికారమిచ్చినీవు
నీదుప్రారబ్ధమనెదవు నీలకంఠ
భక్తబాధలకును గూల్పశక్తిలేదె?
సంతతాహ్వాతసునార్తిసాంబమూర్తి. 15

సీ. సభలోనఁగననొక్క సజ్జనుండుండెనా
తత్సభాపతికి మోదంబుగల్గు
బుత్రులలోనొక్క పుణ్యాత్ముఁడుండెనా
తల్లిదండ్రుల తపంబుల్లసిల్లు
గ్రామంబులోసదా శ్రీమంతుఁడుండెనా
గ్రామస్థులకును సౌఖ్యంబుగల్గు
బోష్యులలోమంత్రి బుద్ధిగనుండెనా
రాజునకురు యశోరాజికల్గు
గీ. గాకయన్యవిధంబుగఁ గల్గెనేని
యన్నివిధముల కష్టంబులందఱకును
ననుభవంబులై వేఱునేననగనేల
సంతతాహ్వాతసుజనార్తిసాంబమూర్తి. 16

సీ. అరుణోదయస్నానమాదులు నిత్యంబుఁ
జేసినబ్రాహ్మణుల్ సేయవలయు
వేదవేదాంగప్రవీణ శాస్త్రార్థముల్
చెప్పినబ్రాహ్మణుల్ చెప్పవలయు
సవనాదిసత్క్రియా ప్రవితతుల్సద్భక్తిఁ
జేసినబ్రాహ్మణుల్ సేయవలయు
బంచాక్షరీమంత్ర పఠనంబుసతతంబుఁ
జేసినబ్రాహ్మణుల్ సేయవలయు
గీ. గాకయితరుల కలవియేలోకమందు
నెంతధనమున్న దోర్బలమెంతయున్న
మౌళిధృతచంద్రకారుణ్య మహిమసాంద్ర
సంతతాహ్వాతసుజనార్తిసాంబమూర్తి. 17

సీ. శరణాగతత్రాణ బిరుదుధరింపంగఁ
జూనినక్షత్రియుల్పూనవలెను
ఘనబలోజ్వలశత్రుల శత్రుకాండంబు ఖండింపఁ
జేసినక్షత్రియుల్సేయవలెను
కృపతోడబ్రాహ్మణశ్రేణికి క్షేత్రంబు
లిచ్చినక్షత్రియులివ్వవలెను
దేవాలయాదిగ దివ్యసంస్థానముల్
నిల్పినక్షత్రియుల్నిల్పవలెను
గీ. సాహసాంచితశూర సంస్తవ్యగుణవి
హీనులై నట్టియితరుల కెట్లుగలుగుఁ
గరధృతకురంగకారుణ్య కనదపాంగ
సంతతాహృతసునార్తిసాంబమూర్తి. 18

సీ. ఆర్జనాకార్యం నార్జవంబుననైనఁ
జేసిననూరుజుల్ సేయవలెను
ధర్మకార్యముసద్భక్తి తాత్పర్యులై
చేసినవైశ్యులు సేయవలెను
బ్రాహ్మణసంతృప్తి బహువిధంబులుగాఁగఁ
జేసినఁగోమట్లు సేయవలెను
పరధనముహరించి వ్యవహారమునఁ
గాలుసాఁచిన బేరులుసాఁచవలెను
గీ. గాకయితరుల కెన్నియుగల్గియున్నఁ
జేయఁగాలేరుబుద్ధి విశిష్టులైన
మౌళిధృతగంగ సంతతమాన్యసంగ
సంతతాహృతసుజనార్తిసాంబమూర్తి. 19

సీ. ఊసరక్షేత్రమే నొప్పపఱచిసాఁగుఁ
చేసినశూద్రులు సేయవలయు
నొకపంటకాకుండ సకలంబుఫలియింప
నూడ్చినబాదజులూడ్చవలయు
దధ్యాదివస్తువుల్తగ నమ్మికొడబుఁ
గూర్చినఁజరణ జుల్గూర్చవలయు
దనబంధువులనైఁ దగువేళనన్యథా
యెంచినఁ గాపులెయెంచవలయు
గీ. నెంతకష్టపుపనియైననింతలోనఁ
జేయఁదలచిన నశుచులు సేయవలయు
శాలదాభ్రనిభాంగదుర్జనవిభంగ
సంతతాహృతసుజనార్తిసాంబమూర్తి. 20

సీ. నీతిప్రసంగముల్నేర్వక దుష్టుల
మంత్రమ్ము వినియెడి మంత్రివరులు
బంట్రోతునమ్మక బానిసెనమ్మక
డబ్బేప్రధానమౌ తాణెదార్లుఁ
గరణాలపోకగడ్డిపరకకయి
పీకులాడెడి యినస్పెక్టర్లను
నదిబ్రాయుఁడిది బ్రాయుఁడనుచుఁజెప్పిన బ్రాయ
లేదనిచెప్పెడి లేఖకులును
గీ. నాజ్ఞమన్నించితిరుగని యట్టిభటులుఁ
గాగితాల్దీసివేయు రికార్డుదార్లుఁ
గలుగునృపుసౌఖ్యమే మనఁగలదుచెపుమ
సంతతాహృతసుజనార్తిసాంబమూర్తి. 21

సీ. క్షితినెవనిఁగూర్చి చింతింపవలవదు
చెడుకార్యమింతైనఁ జేయవలదు
దన్యాయముగ విత్తమార్జింపవలవదు
ధనముధర్మములేక దాచవలదు
సదపకారంబెప్డు సలుపంగవల్వదు
పరులవృద్ధికి దుఃఖపడఁగవలదు
ధనవంతుడనని మత్తతనుండఁగావల్వ
దేలికకెగ్గెన్నఁడెన్నవలదు
గీ. మాన్యజనముల మన్నింపమానవలదు
పదినినుబత్తివేడంగ మఱువవలదు
భక్తశాత్రవశోషయో భక్తపోష
సంతతాహృతసుజనార్తిసాంబమూర్తి. 22

సీ. కరణంబుబహు జనాక్రందుండుకారాదు
మున్సబులంచంబు ముట్టరాదు.
పీకులాడెడి యినస్పెక్టరుండఁగరాదు
పగబూను తాణెదార్గలరాదు
తగిలితెమ్మను గుమస్తాలుగల్గఁగరాదు
నీతిలేనిప్రధాని నిలుపరాదు
చెడుగువినుతహాశ్శీల్దారుకారాదు
బహుబుద్ధియగు మహీపతియుఁగూడ
గీ. దింతయైనసుప్రజలకు నంతసుఖము
గల్గునని చెప్పవచ్చు నిక్కముగఁబుడమి
సాయకీకృతలక్ష్మీశజగదధీశ
సంతతాహృతసుజనార్తిసాంబమూర్తి. 23

సీ. నిత్యవ్రతంబుగా సత్యవాక్యముచేత
సజ్జనప్రియముగా జరుగువాఁడు
ధర్మంబులంచు స్వధర్మముల్ విడువక
నిరతంబుజేయుచు నెగడువాఁడు
కార్యంబులనుచు సత్కార్యముల్మఱువక
చేయుచునిత్యంబుఁ జెలఁగువాఁడు
రాజకార్యములని రాజకార్యంబుల
మంత్రియైదుర్వృత్తి మఱలువాఁడు
గీ. మంత్రిచెంత దురుక్తుల మఱచువాఁడు
నిజముఁబరికించి శాసింపనేర్చువాఁడు
నయవిదులటంచుఁ బుడమినెన్నంగవచ్చు
సంతతాహ్వాతసుజనార్తిసాంబమూర్తి. 24

సీ. మాదిగగూడెంబు మఱఁగినవేఁపియుఁ
బొరిగిండ్లమఱఁగిన పువ్వుబోడి
గర్భయాచనసేయఁగా మఱఁగినవాఁడు
కంటింటయాచింప నేఁగువాఁడు
పొరుగిండ్లభోజనంబు నరుచిఁగొనువాఁడు
సత్రంబుల భుజింపసాఁగువాఁడు
పైతృకంబుల నలవాటుపడినవాఁడు
బిండంబులను దినుచుండువాఁడు
గీ. మంత్రితోలంచము గ్రహించమఱుగువాఁడు
దప్పసాక్ష్యంబులన వెంటఁ దవులువాఁడు
మానగాలేరు గదయెన్నిమతులువినిన
సంతతాహ్వాతసుజనార్తిసాంబమూర్తి. 25

సీ. మంగళంబగునీకు గంగధరాజయ
మంగళంబులునీదు మానినులకు
మంగళమ్ములునీకు మారయుగ్మమునకు
మంగళము వృషతురంగమునకు
మంగళమ్ములు నీప్రమథగణంబులకునుబహు
మంగళమ్ములు నీభక్తులకును
మంగళంబగు నీదుమహాళికిమతిబహు
మంగళావళులసి మాలికలకు

గీ. మంగళంబగునీదు కురంగమునకు
మంగళంబులఁగొని మేలొసంగుమయ్య
ప్రమథగణపాలపాలిత భక్తజాల
సంతతాహృతసుజనార్తిసాంబమూర్తి. 26

---

# శాంతానందయోగిరామశతకము.

:0:

క. శ్రీరామనీదుమంత్రము
పారాయణసేయువారి పాలనభీమా
మేరుసమధీరరామా
కూరిమినీదాసునేలు గురువరరామా. 1

క. వేదాంతవేద్యుఁడనుచును
వేదాదిశృతులునిన్ను వేట్కనుబొగడఁ
మోదముగను నెరనమ్మితి
భూదరవేగమున నన్నుబ్రోవుమురామా. 2

క. యోగిధ్యాన పదాంబుజ
రాగద్వేషాదిరహిత రావణహరణా
సాగరమద సంహరణా
యోగంబున వరములిమ్ము వేడగ రామా. 3

క. మతిహీనులయిన మనుజుల
హితవుగ గతియనుచు నమ్మి వెతపడు టేలా
పతితాత్మపావనా విను
సతతము నేలుటకునీ వెసద్గురు రామా. 4

క. చదువని మూఢులసంగతి
యధముల కేయగును గాని యార్యుల కగునా
పదపడి మూర్ఖులసంగతి
బధిరులకగు విశ్వశింప ప్రవిమల రామా. 5

క. చోరునికి లేదు దైవము
జారిణికిని లేదు వట్టి జగతిని నరయన్
గ్రూరునికి లేదు కీర్తియు
శౌరిని బాగడకను లేదు సద్గతి రామా. 6

క. బాలులకు బలము విద్యయు
గాలునికిన్ బలము ఖలుల ఖండించుటయున్
శాలలకున్ బలము నీడయు
బూలకు బరిమళము బలము పొందుగ రామా. 7

క. బీదలకు నాసబెట్టుట
సాధులపై చలము పూని సాధించుటయున్
వేదాంతుల దూరుటయును
గాదలపడి చెడుటకొరకు ఖలులిల రామా. 8

క. శాంతంబే సత్సాధన
శాంతంబేసకలసుఖము సమకూర్చుదగన్
శాంతంబే సద్గతియగు
శాంతంబునబెనగువారు సరసులురామా. 9

క. ధనమార్జించిన నరులకు
ఘనముగ సుజ్ఞానమున్న గలిగినధరలో
జనకామలతత్సముఁడని
జనులందరు పొగడగలరు జానకిరామా. 10

క. తన్నాశ్రయించువానికి
మన్ననగాసుంతయైన మరినివ్వదగున్
దిన్నగరేఁనుమూపను
దున్నలుసత్కీర్తినొంద దూరమురామా. 11

క. ఆశయెయిహా పరదుఃఖం
బాశయెయదుపాశమగును యవనీస్థలిలో
నాశజననకారణమగు
నాశమెనిను దెలియనివ్వదాత్మారామా. 12

క. తుచ్ఛసుఖంబున కొడబడి
హెచ్చుగనీదివ్యమహిమ యెరుగకభూమిన్
చిచ్చునబడుమిడుతలవలె
చచ్చిననరులెందరనిన సద్గురురామా. 13

క. సంపదలు శాశ్వతంబని
సొంపునమరి త్రుళ్లుచుండు శుంఠలకడకున్
ఇంపొంది యముగబోయిన
తెంపునసిరినోడితనుచు దెప్పనురామా. 14

క. సిరులేగతియను నరులకు
నరుదుగనినుగానవశమె సవనినినరయన్
మరిపెక్కుభ్రమల విడుతురె
నిరుపమమగుభక్తినుండ నేర్తురెరామా. 15

క. రాజులబేదరికంబున
రాజిల్లుచునున్న గాని రసికత తెగునా
జాజులుచెట్టుఁగ్రాలిన
రాజులకని మానగలరెంఘుకులరామా. 16

క. తత్వంబుదగును యోగికి
సత్వమురాజసముదగును సరసనృపతికిన్
సత్వముకాఁసితమనము
సత్యాత్ములకెల్లదగును సరవిగరామా. 17

క. రానిదిరాదని యెరుగుచు
బోనిదిబోధనుచు నెరిగిపూనికతోడన్
మానని భేదము నొందుట
మానుగనినుగాననట్టి మాయయురామా. 18

క. సతిసుతులు సకలజనులును
హితవుగతనవెంబడిగను నేతేరరహాహా
మతినమ్మి మోసపోయెడి
పతితులుననుగనుటయరుదు ప్రవిమలరామా. 19

క. ఇత్తురుబ్రాణంబెరుగక
వత్తురుకర్మాధికార వర్తనకెల్లన్
దొత్తువలెనొగ్గియిత్తురు
నిత్యాత్ములఁదెలసియిడరు నెసరుసరామా. 20

క. మాటకుముందర జారబడి
మేటిగాదానుండుకొరకు మేదినిలోనన్
దాటోటుమాటలాడెడు
బూటకులకుముక్తిలేదు పొందుగరామా. 21

క. వితరణమెరుగని దానము
వితరణతానెరుగలేని వీరత్వంబున్
వితరణగదెలసి జూడన
వితరణయగుకూలసమ్మ విధమగురామా. 22

క. ప్రొద్దునసిద్దురలేచియు
శ్రిద్ధగలౌకికవృత్తి సాహసుడగుచున్
బద్ధుండై వేదాంతుల
వద్దనుదాబెద్దియనుచు వదరునురామా. 23

క. కఫలకునివ్వని దాతలగా
రవమెట్లున్న మృత్యుఘటదీపంబౌ
కవిశింహములకు నొసగిన
భువిగాజులకుప్పెరీతి పోలికరామా. 24

క. వనితలచేశృంగారము
వనితలచేగలుగుకీర్తి వంశంబునకున్
వనితలచేనపవాదము
వనితలచేజెడును తెలివివసుధనురామా. 25

క. పట్టెడునామముతీర్చిన
మట్టెంతయులేకబూదిమై బూసుకొనన్
పట్టిదియగునిను మనమున
పట్టగనట్టిచపలపరులకురామా. 26

క. ఎంగిలికూటికి దిరుగుచు
గొంగునబిచ్చంబు నెత్తుకొను బీదలకున్
బంగారుమిగుల గలిగిన
బొంగుచుధర్మములు మరచిపోదురు రామా. 27

క. సుజ్ఞానియె బ్రాహ్మణుడగు
నజ్ఞానియెశూద్రుఁడగును నవనినినరయఁగన్
ప్రజ్ఞానబ్రహ్మంబని
సుజ్ఞానశ్రుతులు బలుకుసూటిగ రామా. 28

క. ధరభోగము స్వప్నముచే
బరభోగము బ్రహ్మవిద్యబాగుగ నరయన్
దొరకొనిరెండును గలిగిన
నరుఁడేశ్రీహరియటంచు నమ్ముదు రామా. 29

క. సాధుజనసమ్మతంబుగ
నీధరలోధనముగూర్చి నింపలరంగా
బీదలకుపకారంబుగ
నాధారము జేయువాఁడు నభవుఁడు రామా. 30

క. కొండెములు చెప్పువానిని
పండితులనునిందఁజేయు పాపపునరులన్
కండలుదాచెడి బంటును
దండించును యముఁడు వడిగదగినటు రామా. 31

క. మాటకు ఘనసత్యంబగు
బాటకుఘనమగురవల ప్రబలతతెలియన్
కోటకుబనయగు బురుజులు
కూటికిఘనశాఖభృతము గురువర రామా. 32

క. వెన్నెలకందము పున్నమ
కన్నులకందంబుజూపు కనుటయుమిగులన్
కన్నెలకందము సుగుణము
వెన్నులకందంబుజొన్న వేడుకరామా. 33

క. మాట్లాడనేర్పుగలిగిన
పోట్లాటలుగలుగవెపుడు పొందుగసరయన్
మాట్లాడ నేరకున్నను
పోట్లాటకుమూలమౌను పొలుపుగరామా. 34

క. వీడన్ దగుపాపాత్ముల
గూడన్ దగుభక్తిజనుల గోర్కెలుదీరన్
వేడందగువైకుంఠుని
నాడన్దగుద్రోహబుద్ధినొప్పగరామా. 35

క. అభయప్రదానుడనుచును
విభవంబుగనిన్ను వేడి వెతలనుమానన్
సభయముచేకొని బ్రతికిన
ప్రభువైనవిభీషణునిదె భాగ్యమురామా. 36

క. తనయుని సద్వర్తనగని
యనవుగబదియారునేడు నరిగినపిదపన్
తనవెనుకబ్రతుకుదృతిగని
అనవుగపెండిలినిజేయు నందమురామా. 37

క. తానేర్చినట్టివిద్యను
మానకయభివృద్ధిజేయ మహిపరులిలనా
మానవునిగనెడు జనులకు
నానందముగానుదోచు నంతటరామా. 38

క. యేలుచురాజులు భూమిని
గూలంగా తృణములైన కొనిచననెఱుగర్
మేలునుకీర్త్యపకీర్తులు
చాలందృఢముగనునిలచె జగతినిరామా. 39

క. అన్నముపెట్టినిసత్రము
నున్నములేనట్టివిడెము చూడనికన్నుల్
మన్ననయు నరయధాత్రిని
పన్నుగనుడువుటకు ఫలముపావనరామా. 40

---

# శ్రీ సూర్యనారాయణశతకము.

—:0:—

శా. శ్రీమత్వకజమిత్ర శాత్రవహరా శ్రేయస్కరాభాస్కరా
సామాదిస్తుతపాదపద్మ శుభదాఛాయామనోవల్లభా
కౌమారీప్రియవంద్య భక్తజనసంగాముక్తిమార్గప్రదా
క్షేమారోగ్యఫలప్రదాననిపుణా శ్రీసూర్యనారాయణా. 1

శా. శ్రీమద్వర్తులమండలాంతరల సత్సింహాసనాధీశగో
ధూమాతిప్రియలోకకారణవి నిర్ధూతాశ్రితాఘాఘుచి
ద్భామానందకరా సహస్రకిరణాపూర్ణప్రతాపోగ్రని
స్సీమాత్యద్భుతసద్గుణాసకరుణా శ్రీసూర్యనారాయణా. 2

శా. నీవేతల్లివిదండ్రివిష్ణుఁడవు మన్నింపఁగ గురూత్తంసకుం
డీవేనాకిలదోషునీడ మఱియున్నీవేవిపద్బాంధవుం
డీవేనాయిలవేల్పువంచుమదిలో నేనెంతువేయేల
నాజీవాధారము నీవకావదగవే శ్రీసూర్యనారాయణా. 3

శా. చేతఃపద్మమునందుఁ జేర్చినినునే సేవింతులోకైకవి
ఖ్యాతాదివ్యసువర్ణగాత్ర నిగమాకారాగ్రిహాశాజగ
ద్భ్యాతాళు ల్గనుప్తినొంద నటనఃదోర్భధాకృతిన్వెల్గుదా
శ్రీతత్వార్థరహస్యసారసగుణా శ్రీసూర్యనారాయణా. 4

శా. కావంబ్రోవఁగఁగర్తనీవనుచు శంకావర్తనల్మానినా
భావంబందుదలంచి సారమతమే పాద్మాణ్యమంచుఁ మదిన్
భావింతుఁ బ్రణుతింతునెంతువరు సంప్రార్థింతుబూజింతునే
సేవింతుంబలుమారు బ్రోవగదవే శ్రీసూర్యనారాయణా. 5

శా. బ్రహ్మవిష్ణుశివస్వరూపసుకలా ప్రత్యక్షదేవాకన
ద్బ్రహ్మండగ్రహాగోళ దీపకళికాభాస్వత్ప్రభామండలా
బ్రహ్మండపరికరాత్తలోక భరణాపాపోగ్రమత్తేభరా
ట్సింహాకారాయపారవార్ధికరుణా శ్రీసూర్యనారాయణా. 6

శా. ప్రాతఃకాలముఁనందె వండయిఁనసద్భక్తింగృతస్నాతులై
దాతాంతఃకరణైక నిష్ఠతములై దండప్రణామంబులం
జేతులోమ్రడ్చినుతుల్పఠింపుచుమిముఁన్ సేవించినంజాలదే
సేతుస్నానఫలంబువేరెకలదా శ్రీసూర్యనారాయణా. 7

శా. అంతాభానుమయమ్మటంచు నినులోకాంతర్బహిశ్చక్షురే
స్వాంతంబందుఁదలంపకన్య తరదేవభ్రాంతులై మూర్ఖకుల్
చింతారత్నము మానిగవ్వల నొగింజేకొన్నచందఁబుగా
జింతింపన్ ఫలమేమికల్పశతమ శ్రీసూర్యనారాయణా. 8

శా. ఛాయావల్లభనీసుతుండనను విశ్వాసంబుతో జూచినా
కాయక్లేశభయంబుమాన్పి భవరోగాలిన్ నివారించిదీ
ర్ఘాయుష్మంతునిగా నొనర్చిబలసౌఖ్యంబుల్ ప్రసాదించి సు
శ్రీయోవంతునిజేసి బ్రోవగదవే శ్రీసూర్యనారాయణా. 9

శా. భూయస్తేప్రణయామియంచు మదిన్ భూషించుభక్తుల్ సదా
యేయారోగ్యఫలంబుగైకొనుచు దామేరీతిహర్షింతురో
యాయారోగ్యశుభంబుపట్టిదశమాఖ్యస్థానివై యిచ్చెదు
శ్రీయుక్తిన న్నుబ్రోవువార్ధికరుణా శ్రీసూర్యనారాయణా. 10

శా. తేజోరాశివిద్వాదశాత్ముడవిలందివ్యప్రభావుండవున్
రాజీవాప్తుడవప్రమేయుడవు ధీరాజద్గ్రహాష్టాళికిన్
రాజశ్రీనిధివంతరిక్షమణివౌగా నిన్నుగాలత్రయిన్
జేజేయంచు భజించి మ్రొక్కెదనుమీ శ్రీసూర్యనారాయణా. 11

శా. నీవస్త్రాద్రికిబోవ సర్వజగముల్ నిద్రించునీతోడనే
నీవాప్రాగుదయంబునొంద జగముల్ నిర్నిద్రమౌనీజగం
బావిర్భావముజేయబ్రోవనశపర్ హాకర్తవీవేకదా
శ్రీవాణీశ్వరవంద్యమాన చరణా శ్రీసూర్యనారాయణా. 12

శా. స్వామిద్రోహులుకొందరీయిలన్ సామాన్యగానెంతురో
స్వామీనీచరణంబులాననిమనే సాక్షాత్పరబ్రహ్మగా
వేమారున్నుతియింతునెంతునిక నీవేదిక్కునన్నేలుమీ
సీమామూలమెరుంగ వేడెదనుమీ శ్రీసూర్యనారాయణా. 13

శా. నానావస్తుపదార్థముల్మొదల నిన్నానింబ్రదర్శించినం
గానన్వచ్చుటలేకయున్న జగముల్ గాఢాంధకారంబుగా
హానింజెందదెనీవులేనిదినమాహా దుర్దినంబేకదా
సేనానిస్తుతనీరజాభచరణా శ్రీసూర్యనారాయణా. 14

శా. లోకంబున్మతినిన్నుగొల్చి మదిలోలోగోర్కెలీడేరని
శోకంబందిచెలంగుచుండునట హా వోద్యంబటో సత్కవు
లోకులొల్చిపజేష్టసిద్ధిగనుట ల్లోకేశ్వరాభాస్కరా
శ్రీకాశీపతివంద్యమాన చరణా శ్రీసూర్యనారాయణా. 15

శా. నీపుత్రుల్యమకర్ణమండకపి జోన్నైతల్మహాధర్మవి
ద్యాపారంగతులత్యుదారులు సదాయామాఘభోగుల్ గదా
నీపుత్రున్ మనుజాళి బ్రోవవలదే నీవాడనో తండ్రి వి
ష్ణేపాద్యాదితమిస్రపంక్తి హరణా శ్రీసూర్యనారాయణా. 16

శా. కార్యాకార్యములేర్పరించు నిగమగ్రంథమ్ములన్ శ్రీఘృణి
స్సూర్యాదిత్యయటంచు సారమనుబుక్తుల్ మొరల్వెట్టగా
ధైర్యంబంది భజింతు నయ్యునిను మీ దాసానుదాసుండని
శౌర్యశ్చిత్పదమిచ్చి బ్రోవగదవే శ్రీసూర్యనారాయణా. 17

శా. సాయంకాలమునందు నీవు హరివై సర్వప్రపంచంబులన్
దాయాపాత్రుల జీవముల్మరిగియుండన్ జేసి సూర్యోదయ
ధ్యాయామంబునత్తు నీవు భగవద్వాచ్యుండవై క్రమ్మరన్
శ్రీయుక్తింజగదేకరక్షకుడవో శ్రీసూర్యనారాయణా. 18

శా. ధాత్రిమ్మేలరుణాంబు మీకథ యదార్థంబే కదా బ్రహ్మగా
యత్రిన్ భర్గవిశిష్టశబ్దమున కయ్యాయర్థమీవే కదా
గాతారోగ్యము జెంద నెమ్ముటలు భక్తశ్రేణి నిన్నే కదా
చిత్రంబుల్ భవదీయ దివ్యమహిమల్ శ్రీసూర్యనారాయణా. 19

శా. హర్షంబొప్ప భవత్సహస్రకిరణార్త్మపాత్రుండౌ మేఘుచే
వర్షాకాలమునన్ జలంబు జగతిం వర్షింపగా జేసి యా
కర్షింపింతువు పుష్కలారాశినటులాగామీ ప్రబీజార్థ మో
శీర్షాగ్రస్థసమంతకాభ సుగుణా శ్రీసూర్యనారాయణా. 20

శా. ఆవేళన్ సుధనొంద దైత్యులని మీరా శౌరికట్లాడగా
నా వైరంబున రాహుకేతువులు మీకడ్డంబుగా దోతురా
హా వర్ణింపనదొక్క పుణ్యదివసంబౌనంచు యుష్మజ్జనుల్
సేవింపంగ రుణించి వల్కి తిరిగా శ్రీసూర్యనారాయణా. 21

శా. సత్తామాత్రునిగా జగత్ప్రభువుగా సాక్షాత్పరబ్రహ్మగా
చిత్తాహంక్రియమానవర్జితునిగా శ్రీవిష్ణుగా జిష్ణుగా
బ్రత్యగ్బ్రహ్మముగా బరాత్పరునిగా భావింతునో యయ్య నీ
చిత్తంబవ్వేలనాదుభాగ్యము హరీ శ్రీసూర్యనారాయణా. 22

శా. సత్యంజ్ఞానమనంతమన్న శ్రుతిలో జాటించు నర్థోక్తియా
దిత్యో బ్రహ్మయటంచు బల్కునిగమోదీదంబు వీక్షింపఁగాఁ
నిత్యత్వంబు విభుత్వమాద్యమెల మిన్నికేతెగెంగానవో
చిత్యంబీమతమెంచు నెన్నదసుమీ శ్రీసూర్యనారాయణా. 23

శా. నీవామోదముఁజేయ బ్రాంగు విషమే నింగంఠభూషం బెకా
నీవాలింపక త్రావియుండ నమృతమేనిన్ మృత్యురూపం బెకా
యీవాదంబున కేవిసాక్షులనఁగా నీశుండు రాహుధ్వజుల్
శ్రీవిఖ్యాతినెఱుంగ ధాత్రిగలదో శ్రీసూర్యనారాయణా. 24

శా. నీవేనన్విడనాడఁజూచిన భళీ నేనేరివాఁడన్ మహా
దేవేశుండవు నన్ను బ్రోవనిక నీదే భారమయ్యా సదా
యీవేతన్నినదూడజీవితమదెట్లౌనయ్య నన్నేలవే
శ్రీవాణీశ్వరసేవ్యమానచరణా శ్రీసూర్యనారాయణా. 25

శా. కాలక్షేపముఁజేయ కెంతయు భవత్కారుణ్యవృష్టిన్ ననుం
బాలింపందగు పాలసూడనిఁక నీపాలంటి నా చిత్తముం
బాలన్ముంచిన నీటముంచిన ధరన్ భారంబు నీదే సుమీ
శ్రీలాలిత్యగుణానుబాద్ధికరుణా శ్రీసూర్యనారాయణా. 26

శా. ఏనేకర్మములాచరించినను నేనేపాపముల్చేసిన
న్నానేరంబులదొక్క కారణమె నీనామంబు విన్నంతనే
నానాకర్మములం దొలంగితి నికన్నన్నేలుటేయార్తికీ
సేనానిస్తుతపాదపద్మచరణా శ్రీసూర్యనారాయణా. 27

శా. నీయావిర్భవమట్లుగాంచి తమముల్నిత్యంబు బెన్గుంపులై
పాయులట్టియువిచ్చు మొగ్గయిఁతృణప్రాయంబుగా మాయమా
నాయజ్ఞానతమంబదెంతనినువిన్నన్ మాయమైపోవదే
శ్రీయారోగ్యఫలప్రదాననిపుణా శ్రీసూర్యనారాయణా. 28

శా. నానాస్థావరజంగమాత్ముఁడగు నానారాయణుండెవఁడో
నానీవేరవిమండలప్రభలలోనన్ జిత్కళారూపమై
యానందింతువులోకమేలమణితాటంక ప్రభాపుంజముల్
సేనాయుద్ధములోన వెల్గుగతిగా శ్రీసూర్యనారాయణా. 29

శా. శ్రీమద్విష్ణుకళాకలాపునినినున్ సేవించిసాక్షాత్పరం
ధాముంగాదిలకింపలేక జగమంతన్ విష్ణుమాయాపతి
భ్రామిత్వంబున సూర్యుఁడందురుతుదిన్ బ్రహ్మంబునీవేకదా
క్షేమారోగ్యఫలప్రదాననిపుణా శ్రీసూర్యనారాయణా. 30

శా. బ్రహ్మేంద్రాదుల కందరానిపదవుల్భక్తాళినిన్ గోరినన్
బ్రహ్మాండంబనిదుద్దుపెట్టక తృణప్రాయంబుగానిచ్చుస
ద్బ్రహ్మణ్యుండవునన్ను బ్రోవగదవే పద్మాప్తపాపేభరా
ట్సింహాకారయపారవార్ధికరుణా శ్రీసూర్యనారాయణా. 31

శా. బ్రహ్మజ్ఞానులమంచు గొందరువృథాప్రజ్ఞల్ ప్రసంగితుకా
బ్రహ్మంబెట్టిదొతామెరుంగరు పరబ్రహ్మన్నినుంగానకా
బ్రహ్మంగాంచుచునిమ్మనాకొసగవే పద్మాప్తపాపేభరా
ట్సింహాకారయపారవార్ధికరుణా శ్రీసూర్యనారాయణా. 32

శా. ఛాయాపూరుషలక్షణంబనుచు మీస్వచ్ఛాయచేయోగులుం
గాయచ్ఛాయనెఱుంగలక్ష్యమిడి జోకందన్నిధానజ్ఞులై
యాయుర్దాయమునాత్మనారసియు నిత్యానందులై యుంద్రహా
శ్రేయోదాతవుభక్త సంఘములకున్ శ్రీసూర్యనారాయణా 33.

శా. ఆరోగ్యప్రదదాన కంకణమునీహస్తాగ్రమందూనినీ
వేరోగంబులనైన బాపగలదిచ్ఛాప్రకారంబులన్
దేరీనీసరియాత్మబంధువులు మాకీరేమలోకంబులన్
శ్రీరామాన్వయభూషణాసకరుణా శ్రీసూర్యనారాయణా. 34

శా. ఏడాగోడముజేసిపొమ్మనకు మిమ్మేడాదిగానమ్మిమీ
జాడన్ జూడగ గోరివేడుచు నమస్కారప్రియోభానుయం
చాడంనేడును వేయుచండములు ముఖ్యంబొప్పగా పెట్టెదన్
జీడాపీడలబోవజిమ్మగదవే శ్రీసూర్యనారాయణా. 35

శా. కాషాయంబరధారివై కదలివేడ్కంపద్మినీకాంతను
శ్రూషాసక్తినిజెందుటెట్లు మఱినిర్దోషుండవై యుండియా
దోషాచారినిగూడుటెట్లు జగమందున్నీకథల్ చిత్రమో
శేషాద్రీశ్వరవంద్యమానచరణా శ్రీసూర్యనారాయణా. 36

శా. కాయల్గాచెనుమ్రొక్కిమ్రొక్కికరముల్కంఠంబు రాసెన్ నెరా
యాయాసంబున నీకృతుల్పలికియుంకానీకటాక్షంబురా
దాయన్ బ్రోచుటకస్తినాస్తి యిదమర్థంబంచునివన్నకా
శ్రీసూత్రేయునిచరించివత్తునెలవా శ్రీసూర్యనారాయణా. 37

శా. నీపాదంబులకేనుమ్రొక్కుటలు కొన్నేనిన్ విలోకింపవా
పాపాత్మున్నిను బ్రోవరావనుచు నాపట్లన్ గటాక్షింపవా
యాపన్నుండనటంచు వేడుటలు నీవాలింపవో భక్తులం
జేపట్టంగనెరుంగవో సకరుణా శ్రీసూర్యనారాయణా. 38

శా. ఏపాపంబులువచ్చినందుకొనెనో యేకర్మముల్దూకెనో
యేప్రారబ్ధమువచ్చి యడ్డపడెనో యేభూతములోన్సెకెనో
యేవంపుల్చెయిబ్రాకెనో యిటులనింకేమేమిసంధించెనో
యీపాపాత్మపురోగరూపముగ నీవీపీడలం బాపవే
శ్రీపద్మాత్మత్తసుధాబ్ధిపూర్ణకరుణా శ్రీసూర్యనారాయణా. 39

శా. ఏకాలంబునలేని రోగములు నన్నేపట్టిబాధింపగా
నేకార్యాటను జేయుచున్నవిక నన్నే కాకినింబ్రోవవే
నాకావ్యాధులుముద్దుగా దకటనేనానిన్ను హాానమ్మితిన్
శ్రీకాశీపతివంద్యమానచరణా శ్రీసూర్యనారాయణా. 40

శా. రోగంబుల్వెడలించుటెంతపని యారోగ్యప్రదాయుండవై
కేరికంటన్ మొకబాణ్బజేసికినుకన్ ద్రిష్టించిచూడంగభూ
త్యాగంబైపగగెత్తవే సకలభూతవ్రాతముల్రోగముల్
శ్రీగంభీరగుణాసుధాబ్ధికరుణా శ్రీసూర్యనారాయణా. 41

శా. ఆవైవస్వతమ ప్రహంబునను దానాదిత్యకలోక్తిగా
సావిత్రిగురుపూజలనర్పన భోజ్యంబొప్పనబ్రాహ్మణల్
గావింపంగ్రతుకోటిపుణ్యఫలముల్ గాంచన్ సమాత్రంబెకా
శ్రీవాణీశ్వరసేవ్యమానచరణా శ్రీసూర్యనారాయణా. 42

శా. యోషాజారమినప్రియంబటుల నయ్యోయింతగా వేడిన
పాషాణంబుకరంగు నీమనసుయే పాషాణపుజాతియో
యీపత్తయినకరుంగదీకరి సాకిత్వంబునీకేలనా
శేషాద్రీశ్వరవంద్యమానచరణా శ్రీసూర్యనారాయణా. 43

శా. చేతోజాతసహస్రరూపవినునాచేతప్పు వాతప్పులా
జేతోమోదముజేయుటొప్పనిదె చిత్తాబ్జమర్పించెదన్
సీతాంశోరమృతార్పణంబనుగతిన్ జేకొంచునన్బ్రోవనా
చేతఃపద్మముల న్వసింపగదవే శ్రీసూర్యనారాయణా. 44

శా. శ్రీలావణ్యసువర్ణగాత్రి కవిరాట్చింతామణీభక్తహృ
ల్లీలానందవినోదతీ ప్రకరనాళాకాంగనాలోలపాం
చాలాకామకళారహస్యనిపుణాశబ్దార్థసంభాషణా
శ్రీలాలిత్యగుణాసుధాబ్ధికరుణా శ్రీసూర్యనారాయణా. 45

# న ర శ త క ము.

———:o:———

క. నీవెపుడే యెడ తెగనిసు
ఖావహమును గోరుచుండి యలయక గలపా
ట్లైన నెపుడు బడియెదో
యావరసుఖమా యాత్మయని తెలియునరా. 1

క. మొదలునను తుదయు గలుగ
బొదలున్ భూతములు తరుచు భూతవితతిగా
నొదవుట, బొదలుట జడియుట
మొదలగునవి గలుగు శక్తి మొదలాత్మ నరా. 2

క. వినుభూతదృష్టి భాసం
బనదగు సకలభావతతి గవ్యక్తంబగునా
ఘనశక్తికి మూలంబుగా
దనరెడు తత్వంబె యాత్మ తరచికననరా. 3

క. ఆత్మంబోలెను దానిని
నాత్మం గనుగొనమొకండు నదియు ద్రివిధభే
దాత్మరహితమై వెలిగెడు
నాత్మేతరమైనదెద్దియగు పడుదునరా. 4

క. నీవలయాత్మాంశంబవు
లేవు వికారములు నీకు లేకున్న బ్రవృ
త్త్యావహమున గలిగియవియె
నీవను భ్రమబెట్టి త్రిప్పనిచుజవెదునరా. 5

క. అనలంబున దీపమువలె
దనరుం బరమాత్మశక్తి దగ నీశ్వరుడున్

గనవత్వములనలాత్మలు
తనువులుదీపములు వికృతితతియగునునరా. 6

క. పూసలలో దారమువలె
దాసర్వములోన నాత్మదనరునిఖిలమున్
భాసిల్లజేసికనునా
భాసితఘనచిత్ప్రకాశబలమలరననా. 7

క. మోహించువాడు మరియును
మోహించబడినయదియును మోహాముమదిలో
నూహింపబ్రికృతివికృతులె
గాహిత్కృతిగనిన మోహకందమెదినరా. 8

క. వినుజగమొకరంగంబౌ
గననగురసవితతి ధీనగమ్రుదిగుణముల౯
జనియించినవాని వికా
రనిధులదగువాని కాపుఁపుజలధినరా. 9

క. శ్రీవర, వాణీవర, గౌ
రీవరులనదత్తను చితరీతుల, జిచ్ఛ
క్తేవంలుగనె విలాసం
వీవిధినమపంగవారు వేరెగననరా. 10

క. నీతను వెనీకునెరవన
భూతలమున నింకనెద్దిపొసగునతమనన్
జైతన్యమూలమీవల
భూతములకునీకవేలబోలవిమనరా. 11

క. స్త్రీలంచుబురుషులంచున్
మేలింతయులేనిభేద మెంచుచుమనుజుల్.

గాలమువశల్లె చెడుదురు
బోలగనని వెల్ల ప్రకృతిబొమ్మలహానరా. 12

క. నీవనితసుతులు సఖులును
నీవరబంధువులు మరియునితరులుజూడన్
నీవలెనాత్మాంశములే
వావిరిబహువేషములను వర్ధిల్లెదురా. 13

క. మే,లెయ్యదియోనీకుం
జాలగగీడెయొ తెలియజాలవుగానన్
మేలెయ్యదియుంగోరక
యోలిబనులు జరుగగనటయొప్పుగనునరా. 14

క. వింతారాహిత్యమునీ
కెంతయునొనగూడ జూడుమిహలోకమునన్
జింతింపనదెపరమసుఖ
మంతింతనరాని ముదమునదిగూర్చునరా. 15

క. అరిషడ్వర్గము గెలువగ
వరశక్తినెసంగజూడు వరుసగవానిన్
దిరముగగెలువగనేర్చిన
దిరముగునానందమెదద్పొంగనవేనరా. 16

క. నీసతియెవ్వతెయారయ
నీసుతుడెవ్వండు దలపనిదియరిదిగదా
ఈసంసారమునీవె
చో్చసంభవమైతివిభ్రమజూడబళనరా 17

క. ధనమెంతదనుకసంపా
దనసేయుచునుందువీవు దగబరివారం

బుసునంతదనుకజనునా
వెనుకన్నీకుశలమెవరు వేడకుగనరా. 18

క. ఒడలునబ్రాణముగలిగిన
వడినెల్లరుగుశలమనుగ వత్తురదిదనర్
నగుభీతిఁజేరజనదా
యొడలినే నిజభామయేమియొడ్డ ననరా. 19

క. కలవాడులేడటన్నను
గలుగునెకలవనుచు నొసగగ గుమదివొగమన్
గలిమియులేమియు విధివశ
ములుగామింపంగ సమయములనెదగునరా. 20

క. చనవలెవివిక్తదేశము
గనవలెనటగలిగియున్న ఘనవనముఖముల్
గొనవలెనెపుడేకాంతికి
జనముఖ్యానందరసము సరవినటనరా. 21

క. మనసునకలవాటగుగతి
జనుటస్వభావంబుగాన జనగసుగతినే
మనసునలవాటుబరుపుము
జనదొండుగతినటుబోవుసరణిజనసరా. 22

క. సుందరిగోచరమైనను
దొందరపడికోరిడాచి దోసములనెమున్
గ్రిందుగనెన్నుము, పైనిం
కందానింగూడదోచ, గనువిధినినరా. 23

క. లోకములనీవునీలో
లోకంబులుగలిగియుండ నీకుదగునివా

సైకమననుంట గొఱికయెడ
లోకవిడంబనముగాదె లోతుగనసరా. 24

క. నాటకమాడెడుతరినా
నాటకవీధులోలినడిపినాటకమైనన్
సాటిప్రజలుతో నటిలిక
వాటంబుగ జరుగువిధముబాటింపునరా. 25

క. ధరగలయుద్యోగంబులు
సరవింగననాటకముల సరణిలోక్రో
త్తరనాటకములు దెలియక
దిరిగెదరవి నిజములుగను దెలివేదినరా. 26

క. కనరాదటబలువిధముల
జనపదముల మూర్ఖతుచ్ఛజనముల మనముల్
వనరంగజేయుభేదము
లనయమునల విత్తసంబులట లేమినరా. 27

క. నేమున్నవాడు రేపిఁ
లేడుగదాయిట్టిగతికి లేనిగరువముల్
వాడమెయిగనుచు జూపుచు
బోడమిచెడనేలమీద పొడగనకనరా. 28

క. ఎట్టిడుగర్వించగరా
దెట్టియవస్థలనుబొంది యెసగుచునున్నన్
వట్టివిగభావములగను
దిట్టతనములేక యవియెదిరములనినరా. 29

క. జనమును, సంతతి, పరువము
ధనమును, భోగములు, సతి, రథంబులు, గుణముల్

కనకంబు, వెండి, యందం
బును, నధికారంబు, గరులు, భూములు, దోటల్. 30

క. లేదిలనకారణంబై
యేదియుభావార్థములను, నెసగువిషయముల్
పొడుకభావార్థములుగ
రాదెవిషయములను గార్యరాసియననరా. 31

క. కారణములేనికార్యం
బారయనొకఁడుండునటవె యలజన్మముకున్
గారణముండగవలెగల
కారణమలపూర్వజన్మ కర్మగ నెసరా. 32

క. కనవేరుగ వేరవిగా
వునీవుగావునగసంగ బొదలెదవాసం
దవిజబలమ్మై యటుగా
వునానందమునె యెప్పుడు బొడగ నెదునరా. 33

క. నీమూలమదియె దాసిని
నేమియుగనలేక దాచి నెంతయుభావ
స్తోమమున, బొందగోరెద
వేమెయినదిగూడుదిరములే యనియునరా. 34

క. తిరమీవు; నీదుగతులవి;
పరమేగతిలేకనీవు వరలుటయాత్మన్
వెరవద్దానికిదానిని
నరయుచెవుడు; దానినోమటంచుగనునరా. 35

---

# కలువాయి శతకము.

———:o:———

సీ. శ్రీయుతమూర్తి యాశ్రితకల్పభూజంబు
కరుణాపయోనిధి కలుషహరుఁడు
సచ్చిదానందుండు సర్వజ్ఞుఁడవ్యయుం
డపరిమేయుండు మహామహుండు
ప్రియకింకరునిఁబ్రోచు నర్జును నేలు
గజరాజవరదుండు ఘనవిభుండు
నాజీవితేశుఁడైన జనార్ధనుఁడు నేఁడు
వనవిహారముచేసి వత్తుననుచు
గీ. జనెనురాఁడాయె నేమొ నాసదనమునకు
క్షణము శ్రీహరి నెడబాయఁజాలనమ్మ
చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడ్కొనివేగ రాగదే తోయజాక్షి.
సీ. వింటివే యిటువంటి విపరీతవార్తలు
నావిభునేలాగునమ్మవచ్చు
నలదానియిరుదోడల్ తలగడదిండ్లాయె
భామగుబ్బలు పూలపానుపాయె
సుదతివాతెఱ తియ్యఁజుంపిఁ దేనియలాయె
వెలదచేతివిడెంబు విందులాయె
వనితపయ్యెదవల్లెవాటు దుప్పటియాయె
పణతిమాటలెయాటపాటలాయె
గీ. ననుచు సతిజూచి చెప్పవే యమ్మజెల్ల
యిట్లుజేయుట కలనైన నెరుగనైతి

చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగరాగదేతోయజాక్షి. 2

సీ. రమ్మనేమనవిచేకొమ్మనే కరుణరా
నిమ్మనేనమ్మిన కొమ్మననవె
యింపుగానను గౌగలింపుచు పొత్తిధిర
చింపుచురతులక్రీడింపుమనవె
బాలనేవిభుపాయజాలనేయీ
చలంబేలనేనీకై నగోలననవె
వెచ్చగామైగాక లెచ్చగాపిరుతూపు
లిచ్చగామరుడెద గుచ్చనగునె

గీ. నీరునన్నంబు నిద్రయునిగ్రహించి
వేగుచున్నదిమనవిగా విన్నవించి
చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగరాగదేతోయజాక్షి. 3

సీ. నావిభుడేలాగుపోవుట నెరిగితే
నెరుగాబలిమాలి నిలుపుకుండు
నిలువకకోపించి డిగ్గిపోదలచితే
గదిమిపయ్యెదనంట గట్టుకొందు
కట్టులువదలించి కదలిపోదలచితే
జంటాడివదలక వెంటనుందు
వెంటరామగపించి వెళ్ళగాదలచితే
విడజాలనని మొక్కి వేడికొందు

గీ. ఇట్టునేయుటకలనైన నెరిగియున్న
రమణునిలువెళ్ళనిత్తునా నిమిషమైన

చెలువనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగ రాగదే తోయజాక్షి. 4

సీ. ఏలనేనాడు వాడేలనేయే చేది
మానెనో నాప్రేమమందయాన
వీడకేపహరించనవీడకే యీరేయి
న్నొంటినెట్లోర్తు నయ్యోమృగాక్షి
వేరుగాజూడున వ్వైరుగాయనడాయె
కపటమైత్రిగదమ్మ కంబుకంఠి
మందుచేవలచె నేమందుచేజేతనే
మోహముచూపుల బూసె మోహనాంగి
గీ. వగలటక్కులు జిగిబిగివలపునగవు
టెక్కులొలయించుదానిచే జిక్కినాడు
చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగ రాగదేతోయజాక్షి. 5
సీ. అతివరోసిట్టూర్పులధికమై పొరలుచు
భామనేడెమొకోపవ్వళించె
కసిదీరమోవినొక్కకు మొర్రికెక్కదనటంచు
కాంతనిద్దురలోన కలువరించు
పతివచ్చెననివేగ పరవశమై లేచి
గ్రక్కునబయలంట గౌగిలించు
హాయనిమేల్కనియంత నాదెసజూచి
తలవంచులజ్జించి తల్లడించు
గీ. అంగజజ్వరవేదన నతిశయించె
తడవుసేయకగూడ దిత్తరినిమనము

చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగరాగదేతోయజాక్షి. 6

సీ. అతనిపెన్నురమునసంటి గ్రుమ్మగగాని
గుబ్బలపొగరెట్లు గుదురునమ్మ
వాతెరమొనపంటచడిగ నొక్కకగాని
యధికదాహంబెట్లుడగునమ్మ
సురతబంధంబుల సుక్కిచిక్కకగాని
గబ్బిమదంబెట్లు గరగునమ్మ
కవగూడిపెనగొని కౌగలించకగాని
తమిపెగ్గలంబెట్లుతగ్గునమ్మ
గీ. కాయమింకను నిల్వదేకంబుకంటి
నేనతనిమీఁద ప్రాణముల్ నిలిపినాను
చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగరాగదేతోయజాక్షి. 7

సీ. ఎన్నగాప్రాణేశు నెదుటవర్తింపని
సొమ్ములజగ్గులైన సొగసులేల
కనుపేర్మివిభునెదగమకించి గ్రుమ్మని
గబ్బిచన్గవయేల కాయమేల
పతితోడచౌశీతిబంధముల్ పెనగని
తనువేల యీచక్కదనములేల
వయసుప్రాయంబున వసుమదగ్గిరలేని
బ్రతుకేలహెచ్చుసౌభాగ్యమేల
గీ. ఇట్టిబలుజవ్వనపుకోర్కెలెట్లుదీరు
కంటనిద్దురకలనైన గాననైతి

చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగరాగదేతోయజాక్షి. 8

సీ. చెలువసాష్టాంగంబుచేసి వేడనటంచు
పలుమారునెనరురా బలుకరమ్మ
తమకమగ్గలమాయె తాళజాలనటంచు
వినయోక్తులను విన్నవించరమ్మ
బిగిగబ్బిగుబ్బలపొగరు కోర్వనటంచు
తిన్నగామదినాట తెల్పరమ్మ
మాటికినిను నెంచి మగువనిపలుకులు
చెలగిహెచ్చునటంచు జెప్పరమ్మ

గీ. మరునికేళికిరాకున్న మానెగాని
మోముజూపించిపొమ్మనే ముద్దుగుమ్మ
చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగరాగదేతోయజాక్షి. 9

సీ. పదియేండ్లకేగబ్బి ప్రాయంబువచ్చునా
వచ్చితేమరులింత హెచ్చుటేమి
హెచ్చితేవానిపై యీవింతమరులేమి
మరులాతనికిలేమి మర్మమేమి
మర్మముదెలియక మగువనంపినదేమి
యంపితేరాను పొమ్మన్నదేమి
పొమ్మనెబోమరు పోరాటమదియేమి
పొరగామమతల బొరలుటేమి

గీ. యేమొయీమాయవలపు పోదెముమత
దైవమీలాగునన్నే చదలచినాడొ

చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగరాగదేలోయజాక్షి. 10

సీ. కోమలినెరికురుల్ కొప్పుంచకుందెనా
వింజామరుల సేవనేడ్కజేతు
మగువవాజ్మాధురీ మాటాడనేర్చెనా
గూడబుచ్చును పంచదారరాశి
చెలియపాలిండ్లు పూచెండ్లంతలాయెనా
యమరింతుపైడి కుంభములుగుడిని
యేణాక్షి వేగ మీఁడేరినన్నొందెనా
చేయింతువిరునాళ్ళ చెలువముగను

గీ. ననుచునాకైనవేల్పుల కందరికిని
మ్రొక్కినన్నేలినాడెయోమోహనాంగి
చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగరాగదేలోయజాక్షి. 11

సీ. కురులుపెండంబులై కొప్పుపెట్టినవార్త
సఖియజెప్పినవన్న సరములిచ్చె
నటచనుల్ నిమ్మపండ్లంత లాయెనటంచు
బల్కినన్నోటికి పతకమిచ్చె
అందమైనూగుటార మరియుండినవార్త
మగువచెప్పిన కంఠమాలనిచ్చె
అతిశుభంబుగ ఋతుమతినైనవార్తనా
డెరుగింపవేవరాలిచ్చెనీకు

గీ. ఇట్టునామీఁదప్రేమచే నీవులిచ్చి
మచ్చికలుచేసియపుడె యామమతమఱచె

చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగరాగదేతోయజాక్షి. 12

సీ. విరులుకొప్పునజుట్టి వేడుకగాజూచు
సొమ్ములుమైబూన్చి చోద్యమందు
తిలకముచక్కగాదిద్ది ముద్దిడికొను
కంచునతోడిగించి కౌగిలించు
వలువజగ్గుగకట్టి ఎగగనివెరగందు
పైటసొంపుగదీర్చి భ్రమసిపొగడ
కడెగడెకొకవింతగాను శృంగారించి
తలయూచియజుని స్తోత్రించుచేయు
గీ. నింతియతిమోహియైన ప్రాణేశుడిట్లు
నన్నుబాయుటకల నొకనాడుయెరుగ
చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణు
తోడుకొనివేగరాగదేతోయజాక్షి. 13

సీ. అతివనేనీ మధురాధరంబునుగోల
యాసుధామధురము లరుచియయ్యె
నీమోముకళలహార్నిశము జూచన
నిందునుగనుగొన నిచ్చదోలగె
భామనీకుచములపై బవ్వళింపగా
శేషతల్పముమీద చిత్తమెడసె
రామనీయౌవన రాజ్యంబులేలగా
సకలాధిపత్యము సహ్యమయ్యె
గీ. ఇంకనుబాయ జాలనేనెన్నటికిని
యనినమాటలమరచి నాడెల్లనాడె

చెలువనీవేగికలువాయి చిన్నికృష్ణ
తోడుకొనివేగరాగదేతోయజాక్షి 14

సీ. విరులేలముత్యాల సరులేలప్రాణేశు
డూరకననుబాసి యున్నయపుడు
వగలేలమెయినిండు నగలేలవిభుడిట్లు
రానుపొమ్మనుచు మారాడినపుడు
గృహమేలమాయనుగ్రమేల నానాథు
డలుకనెమ్మదిలోన నిలిపినపుడు
జగ్గేలమేనికినిగ్గేల సరసుండు
మించగామది మచ్చరించునపుడు

గీ. మగడుచూడని సొగసేల మగువలకును
పురుషుడెడబాయకేలటే భూషణంబు
చెలియనీవేగికలువాయి చిన్నికృష్ణ
తోడుకొనివేగరాగదేతోయజాక్షి. 15

---

# రామశతకము.

———:o:———

క. శ్రీరామానీనామము
మారాడకమనుజుడెపుడె మానసమందుఁ
నారూఢిగదలచినపుడె
ధారాధరవారినేలెదవుగదరామా. 1

క. ప్రియతనయుడ నేనంటిన్
భయభక్తితోగురుపదములు బాయకయుంటిన్
దయనీదేయనుకొంటిన్
నయముగ నన్నేలుమంటినాయనరామా. 2

క. అంటిని రామాయనినే
వింటినినీమహిమకొంత వీనులతోనే
యంటినిగతి నీవేయని
బంటనునేనీకు యంటిబాయకు రామా. 3

క. పంకజలోచననీపద
పంకజములునాదు మదినిపట్టుగబడితిన్
యింకనుదైవమునీవేగ
శంకలుదీర్చికనుగావు శ్రీరఘురామా. 4

క. సరసుడవని నీనామము
మురిపెముతో భజనసేతు మునిసురవినుతా
కరిపరిపాలనజేసిన
బిరుదునిజంబై తెనేలు ప్రియముతో రామా. 5

క. రామానీవేతండ్రివి
కామితమొసగేటి సీతకాంతయుతల్లిన్
దామోధరమీదాసులు
ప్రేమతోసోదరులు యిలలో పెంపుగ రామా. 6

క. కరివరదుడనినునమ్మితి
సరిమరినీసాటి యెవరుసరియెంచగనీ
దరిజేర్చికరుణించవె
ధరలోనినుమరువనింక దాసుడరామా. 7

క. పలుమరు రామునిదలచిన
యిలలోపలవారిజన్మ మదియగుచూడన్
యిలలో రామునిదలచని
బలవంతులజన్మమెంచపాడటరామా. 8

క. ఎంతనినినునేఁడుమనా
చింతలుదీర్చికనుగావు శ్రీహరినాపై
పంతముసేయకుదొరనీ
చింతయునేమరుననింక చిన్మయరామా. 9

క. సన్నిధివాఁడనుసుమ్మా
కన్నులతోఁజూడవేమికమలజవినుతా
నన్నుతినినునేజేసెద
యెన్నఁడునినుమరువనింక యదుకులరామ. 10

క. వకపరిరామయన్నను
వికలంబైపాపమెల్ల వేగమెచనురెం
డొకపరియను హరియన్నను
అకలంకంబైన పదవియందునురామా. 11

క. పతితముచాపే నామము
హితమతితోఁభజనచేసి యిహపరసౌఖ్యం
గతిజెందెదమునికుచేలుడు
నతభక్తాజనులపాల నమ్మితిరామా. 12

క. పన్నగశయనా నాయొక
విన్నపమాలించవేమి విమలచరిత్రా
యెన్నఁడు నీదయనాకును
మన్ననతోఁగలుగునయ్య మాధవరామా. 13

క. కరిపతిగాచినవారికి
ధరపడిమ్రొక్కంగవారెధన్యులుచూడన్
సిరిసంపద వారింటను
అరయంగానిలచియుండు అనయమురామా. 14

క. సత్తునుచిత్తానందము
ముత్తము యార్యులకు దెలుసు మోహమునొందె
మత్తులు దెలియఁగనేరరు
సత్తుచిదానందమంద్రు సరసులు రామా. 15

క. నీవేదిక్కనినమ్మితి
రావేననుగన్నతండ్రి రావాయిపుడున్
దేవా కావుమునన్నును
భావాతీతుండ పతితపావనరామా. 16

క. వేఁడితినిను నామదిలో
బాడితినీనామమిపుడు భద్రముతోడన్
కూడితినీదాసులనే
వీడితిదుస్సంగమిపుడు విమలభి రామా. 17

క. సీతారాముల భజనము
నీతిగభజియించినట్టి నీచుఁద్విజుడౌ
మాతాపతిని భజించని
నీస్థలమందుద్విజుండె నీచుఁడు రామా. 18

క. జలచరరూపము దాల్చియు
అలయుక సోమకునిదునిమి అంబుధియందున్
సలువకు వేదము లొసగిన
బలమును వర్ణింపవశమె బ్రహ్మకురామా. 19

క. ధారుణికూర్మంబయ్యును
భారముగైకొనియు మంద్రపర్వతమెత్తన్
క్షీరములోపల నమృత
సారంబును నాకులకొసఁగిన సీతారామా. 20

క. కలికావతారమెత్తియు
బలమైనతురంగమెక్కి భక్తులుదప్పన్
బలుఖడ్గముకేలమరచి
కలిహెచ్చినమానవులను ఖండనరామా. 27

క. రామానీయక్షరమును
రామాపామరములెల్ల పరిహారమగుచున్
రామానీనామమహిమ
రామాపొగడంగవశమె రాఘవరామా. 28

క. ఈధరలోపలభక్తిగ
మాధవకరిరాజునిన్ను మదివేడంగా
బాధలుతొలగగజేసిన
పాదములిటుజూపిబ్రోవు పావనరామా. 29

క. మంగళము రామమూర్తికి
మంగళము మహానుభావమహిమోన్నతికిన్
మంగళము లక్ష్మిపతికిని
మంగళమే పొద్దుగురుపుమహిలోరామా. 30

---

# వేణుగోపాలశతకము.

———:0:———

సీ. కౌస్తుభవక్షశ్రీకర పాదరాజీవ
దీనశరణ్యా మహానుభావ
కరిరాజవరదభాస్కరకోటి సంకాశ
పవనభుగ్వరశాయి పరమపురుష

వేదవేద్యానంత విభవచతుర్దశ
భువనశోభనకీర్తిపుణ్యమూర్తి
వైకుంఠపట్టణవాసి యోగానంద
విహగరాడ్వాహన విశ్వరూప
గీ. నీలనిభగాత్ర శ్రీరమణీకళత్ర
సద్గుణస్తోమ యదుకులసార్వభౌమ
మదరిపువిఫాలమునిజన హృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 1
సీ. శ్రీరుక్మిణీముఖసారస మార్తాండ
సత్యభామామనశ్శశిచకోర
జాంబవతీకుచశైలకంపు మిత్రి
విందాసుధాధర బింబకీర
భద్రవయోవన భద్రేభరాజకళిం
దాత్మజాచిదానందనిలయ
లక్షణశృంగార వీక్షణకాసార
హంససుధేష్ణాగుణాపహార
గీ. సుందరకపోలవిబుధ సంస్తుతకృపాల
వాలధృతశైలకాంచన వర్ణచేల
మదరిపువిఫాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 2
సీ. భానుకోటిప్రభా భాసురంబగు వెల్గు
పరులుజూచినగాన బడని వెల్గు
గురుకృపచేగాక కూళలెఱుగని వెల్గు
నమృతంపు దృష్టిచేనమరు వెల్గు

విద్యుల్లతావరి పరివేష్టితంబగువెల్గు
ఘననీలకాంతుల గ్రిక్కు-వెల్గు
దశవిధప్రణవనాదములు గల్గినవెల్గు
మహానులెన్నగ రమ్యమైనవెల్గు
గీ. ఆదిమధ్యాంత రహితమైనట్టివెల్గు
యిట్టివెల్గును సేవింపనట్టిపెద్ద
వారికేలలభించు కైవల్యపదము
మదరిపువిశాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 3
సీ. వేదంబులును నీవె వేదాంగములునీవె
జలధులునీవె భూజములునీవె
క్రతువులునీవె సద్వ్రితములునీవె కో
విదుడటంచననీవె నదులునీవె
కనకాద్రినీవె యాకాశంబునీవె ప
ద్మాప్తసోములునీవె యగ్నినీవె
యణురూపములునీవె యవనీతలమునీవె
బ్రిహ్మమునీవె గోపతియునీవె
గీ. యిట్టినిను సన్నుతింపగానెంతవాడ
కించనుడనన్నుబ్రోవ్రు నీకింకరునిగ
మదరిపువిశాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 4
సీ. వేదాంతయుక్తులువిని రెంపునేర్పక
వాగునాతడు రాజయోగిగాడు
కల్లులొట్టిమతాగ్రి కైపెక్కి తెలియక
వదరినంతనె శాస్త్రవాదిగాడు

పట్టపురాజుచే పట్టియుంచంగాని
గుడిసెవాటికిబారి గుణమురాదు
ముండపై వలపునరెండెఱుంగకమోవి
నానగానేజొల్లుతేనెగాదు
గీ. కోతిపై నున్న సింగపుగొదమగాదు
యెంతచదివినగుణహీను డెచ్చుగాడు
మదరిపువిఫాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 5
సీ. దండకమండలు ధారులై కాషాయ
ములుధరించిన దానముక్తిలేదు
భూతిగంపెడుబూసి పులిచర్మమునుబూని
ముక్కుమూసిన దానముక్తిలేదు
తిరుమణిపట్టెడు తీసిపూసియుతనభుజ
ములుగాల్చినముక్తిలేదు
వాయువుబంధించి ప్రాణంబునలయక
మూతవేసినదాన ముక్తిలేదు
గీ. గురుపదాంబుజములభక్తి కుదిరితమ్మి
దామెఱుంగకముక్తి లేదవనియందు
మదరిపువిఫాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 6
సీ. విధవచెవులకు నేలవిరిలివ్రజపుకమ్మ
లురుకుతొత్తుకు విటుకుండనేల
గుడ్డిముండకుమంచి గొప్పయందంబేల
సరలిగుడిశకు బలుచాందినేల

యూరపందులకు బన్నీరుగంధంబేల
బధిరునకలవీణ పాటలేల
కుక్కపోతుకుజరీకుచ్చులజీనేల
పూటకూళ్ళమ్మకు బుణ్యమేల
గీ. తనకుగతిలేక నొకడిచ్చుతత్తినివారి
మతులుచెరపెడిరండకు గ్రతువ్రతేల
మదరిపువిశాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 7
సీ. అలకాధిపతినేస్తమై నప్పటికిని బా
లేందుమౌళికి భిక్షమెత్తవలసె
కమలాసనునికెంత కరుణగానడచిన
గలహంసలకుతూడుకాడలేదు
క్షీరాబ్ధిలంకలో జేరినప్పటికైన
కొంగతిండికి నత్తగుల్లలేదు
అమరసాహేబు సుబాయెంతనేలిన
బేగంబులకు కట్టుపోగులేదు
గీ. ఒకరికుండెనటంచు మేలోర్వలేక
నేడ్వగారాదు తనప్రాప్తినెన్నవలయు
మదరిపువిశాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 8
సీ. ఆలినియుంచుకోజాలక తెగవర్ల
బ్రతిమాలుకొనువాని బ్రతుకురోత
నర్తనాంగనలవెన్నునచేరి తాళము
ల్వాయించువాని జీవనమురోత

వ్యభిచరించెడి వారవనితగర్భంబున
పురుషత్వమువహించి పుట్టరోత
బంధుకోటికి సరిపడుదుర్వృత్తిని
బడియున్నమనుజుని నడతరోత
గీ. యొగసికుండైన నరపతి ననుసరించి
కృతులొసర్చెడికవి నెత్తి గీతరోత
మదరిపువిఫాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 3

సీ. ఏనంబులకు మంగలెంకడేనగునేటు
ప్రశ్నచెప్పను మాలపాపిగాను
కయితముల్లెన్న భోగముచినెంక దెసరి
సంగీతయిద్దను చాకలెల్లి
శాస్త్రపురాణులు పాయిలసంతమ్మ
చిందులదొక్క దాసరిపెదక్క
యీతెగొట్టనుకోయ వీరేశమేసరిపతి
రతాలకుమాటు మనుములిచ్చి
గీ. యనుచుమూర్ఖాళి యీరీతినపుదినంబు
భూతలమునందు వచియింతుర్నీతిలేక
మదరిపువిఫాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 10

సీ. కన్నెనిచ్చినవాని కబ్బమిచ్చినవాని
సొంపుగానింపుగా జూడవలయు
నన్నమిచ్చినవాని నాదరించినవాని
దాతగాదండ్రిగా దలపవలయు

విద్యనేర్పినవాని వెఱపుదీర్చినవాని
గురునిగాహరునిగా నెఱుగవలయు
కొల్వుగాచినవాని కూర్మిజేసినవాని
సుతునిగాహితునిగా జూడవలయు
గీ. నిట్టివారలపై ప్రేమబెట్టుకొనిన
కసరుబెట్టినమనుజుడు గనుముకీర్తి
మదరిపువిఘాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 11

సీ. కండచక్కెరపానకము బోసిపెంచిన ముష్టి
చెట్టునకుతీపు బుట్టబోదు
పాలమున్నీటిలోపల మునిచికడిగిన
కాకిరెక్కకుదెల్పు గలుగబోదు
పన్నీరుగంధంబు పట్టించివిసరిన
దేలుకొండెవిషంబు తియ్యబోదు
వెదురుబద్దలుచుట్టువేసి బిగించిన
కుక్కతోకకువంక కుదురుబోదు
గీ. మంచిమాటలనెంత బోధించిచెప్ప
మడియరండకు వగునంబు విడువబోదు
మదరిపువిఘాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల.

సీ. జన్నెరోగికిబట్టెజున్ను వేసినయట్లు
పిల్లినెత్తినవెన్న బెట్టినట్లు
కుక్కపోతుకునెయ్యికూడు వేసినయట్లు
చెడ్డజాతికివిద్య జెప్పినట్లు

సాతానినోసట విభూతిరాసినయట్లు
గూబదృష్టికి దివ్వెగూడినట్లు
ధనపిశాచికిసుదర్శనము గన్పడినట్లు
చలిచీమలకు మ్రుగ్గుజల్లినట్లు
గీ. సురభిబడనిక పాముకుజూపినట్లు
దుష్టునకునీతి వెగటుగదోచినట్లు
మదరిపువిఘాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 13

సీ. దొరవద్దనెంతచౌదరుడైన తనమన్వి
తాజెప్ప కార్యసాధకములేదు
రంభైన తనకుచకుంభముల్ ధనచేత
తాబట్టుకొన సుఖతరములేదు
తగవుతోనాపురందరుడైన దనప్రజ్ఞ
తాజెప్పుకొనిన బెత్తనములేదు
తనుజేయుపుణ్యమింతని యొరులతోజెప్ప
బ్రహ్మదేవునికైన ఫలము లేదు
గీ. కనుకనిపియెల్ల నొరులచేగానభువిని
తమనుశక్తిసుమంత్ర తంత్రములులేవు
మదరిపువిఘాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 14

సీ. దొరసొమ్ముదినికార్య సరణివచ్చినవేళ
పారిపోజూచిన బంటువాని
అగ్నిసాక్షిగనుబెండ్లాడిన తనయింతి
నేలకపరకాంత నెనయువాని

కబ్బములేనియు సత్కవిజనాళికి కల్గి
సంతసో నీలియ్యనట్టివాని
యిచ్చినదీవెనలియ్యక యత్నాశ
శ్లోకార్థయాచకుండైనవాని

గీ. గట్టిముచ్చెలతో బడగొట్టి విఱుగ
గట్టి పంపించవలయును గాలుపురికి
మదరిపువిశాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 15

సీ. పతికిమోహములేని సతిజవ్వనంబేల
పరిమళింపని సుమప్రచయమేల
పండితకవివర్యులుండని సభయేల
శశిలేనినక్షత్రసమితియేల
పుత్రసంపదలేని పురుషునికలిమేల
కలహంసములులేని కొలనుయేల
శుకపికరవమొకించుకలేని వనమేల
రాజుపాలింపని రాజ్యమేల

గీ. రవి వికసనంబులేనట్టి దివసమేల
ధైర్యమొదవని వస్తాదుతనమదేల
మదరిపువిశాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 16

సీ. పరదళంబులగాంచి భయముచేనురికిన
రాజుగాడతడు గోరాజుగాని
ధర్మంబులకు విఘాతముసేయుమంత్రిశే
ఖరుడుగాడతడు సంకరుడుగాని

విద్యాప్రసంగముల్వీన రసజ్ఞతలేని
రసికులసభగాదు రచ్చగాని
పతితోడగలహించు పడుకొనియేడ్చెడి
దాలుగాదది యెఱ్ఱతేలుగాని
గీ. శాస్త్రములమించి పట్టి యాచారమైన
నిష్టగాదతనికి పెనుచేష్టగాని
మదరిపువిఫాల మునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 17
సీ. పూపొదలోదాగి పులియున్నరీతిని
మొగలిరేకునముండ్లు మొలచినట్లు
నందనవనములో నాగుబాముున్నట్లు
చందురునకు నల్పుచెందినట్లు
సొగసైనవేమకు సెగరోగమున్నట్లు
మృగనాభిలోపిప్పి తగిలినట్లు
జలధిలోనవిషంబు సంభవంబయినట్లు
కమలాప్తునకుశని గల్గినట్లు
గీ. పద్మరాగమునకు బటలమేర్పడినట్లు
బుగ్గవాకిటి చుట్టబుట్టినట్లు
ధర్మవిధులైనరాజసంస్థానములను
జేరునొక్కొక్కచీవాట్ల మారిశుంఠ
మదరిపువిఫాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 18
సీ. మన్నించునరపతి మమతతప్పినవెన్క
నుత్తముడాభూమి నుండరాదు

పైవిటుండొక్కఁడేర్పడినట్టి కాంతపై
నెంతవాడైన నాసింపరాదు
అన్నదమ్ములతో కొట్లాడిమానసముని
ర్జింపకమును తామసింపరాదు
పగతుఁడునెనరుగా భాషించినను వాని
నెయ్యంబుగొనిచను వియ్యరాదు
గీ. చెలులతోరాచకార్యముల్చెప్పరాదు
పలువమంత్రికి దొరకు పరువులేదు
మదరిపువిఫాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 19

సీ. నినుసదాహృత్కంజమున బాయకుండనా
ప్రహ్లాదునవలెను నేర్పరినిగాను
ఏవేళనిన్ను బూజించుచుండుటకునా
దృఢచిత్తుడైనట్టి ధ్రువుడగాను
సతతంబునిన్ను సంస్తుతి సేయుచుండనా
వేశిరంబుల సర్వవిభుడగాను
నీవిశ్వరూపంబు సేవించుటకుసహా
సాక్షముల్ గల్గువాసవుడగాను
గీ. ఇట్టివారలకృపజూచు టెచ్చుగాదు
దేవనావంటిదీనుని బ్రోవవలయు
మదరిపువిఫాలమునిజనహృదయలోల
వేణుగోపాలభక్తసంత్రాణశీల. 20

# రుక్మిణీకల్యాణము.

———:o:———

క. భూషణములు చెవ్వులకు బుధ
తోషణము లనేకజన్మ దురితౌఘవిని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడగమను గుణభాషణముల్. 1

సీ. ఏనీగుణములు కర్ణేంద్రియంబులు సోఁక
దేహతాపంబులు దీఱిపోవు
నేనీశుభాకార మీక్షింపఁ గన్నుల
కఖిలార్థలాభంబు గలుగుచుండు
నేనిచరణసేవ లేప్రొద్దుఁజేసిన
భువనోన్నతత్వంబుఁ బొందగలుగు
నేనిలసన్నామ మేప్రొద్దుభక్తిలోఁ
దలఁచినబంధసంతతులువాయు

తే. నట్టినీయందు నాచిత్త మనవరతము
నచ్చియున్నది నీయాన నానలేదు
కరుణఁజూడుము కంసాదిఖలవిదారి
శ్రీయుతాకార మానినిచిత్తచోర. 2

మ. ఘనులాత్మీయతమోనివృత్తికొఱకై గౌరీశుమర్యాదనె
వ్వనిపాదాంబుజతోయమందుమునుఁ గన్వాంఛింతు రేనట్టినీ
యనుకంపన్విలసింపవేని వ్రతచర్యన్ నూరుజన్మంబులన్
నినుజింతించుచుఁబ్రాణముల్విడచెద న్నిక్కంబు సర్వేశ్వరా. 3

సీ. ప్రాణేశ నీమంజు భాషలువినలేని
కర్ణరంధ్రంబుల కలిమియేల

పురుషరత్నమనీవు భోగింపఁగాలేని
తనులతవలని సౌందర్యమేల
భువనమోహననిన్నుఁ బొడగానఁగాలేని
చక్షురింద్రియముల సత్త్వమేల
దయిత నీయధరామృతం బానఁగాలేని
జిహ్వాకుఫలరస సిద్ధియేల

ఆ. నీరజాతనయన నీవనమాలికా
గంధమబ్బ దేని ఘ్రాణమేల
ధన్యచరితనీకు దాస్యంబు సేయని
జన్మమేలయెన్ని జన్మములకు. 4

ఉ. నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలుభజింతుఁగదమ్మ మేటిపె
ద్దమ్మ దయాంబురాశివిగ దమ్మ హరింబతి జేయుమమ్మనిన్
నమ్మినవారి కెన్నఁడును నాశములేదుగదమ్మ యీశ్వరీ. 5

మ. కనియెన్ రుక్మిణిచంద్రమండలముఖుం గంఠీరవేంద్రావల
గ్ననవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశ
దే,హునగారాతిగజేంద్రహస్తనిభబాహుం జక్రిబీతాంబరున్,
ఘనభూషాన్వితుఁ గంబుకంఠువిజతమోత్కంఠున్ జగన్మోహనున్. 6

మత్తకోకిల. కల్లలేదని విన్నవించుటగాదు వల్లభయీతనిన్,
బ్రల్లదుం డెగఁ జూచితేనియు భాగ్యవంతులమైతి
మే, మల్లుఁడయ్యె ముకుందుఁ డీశ్వరుఁడంచు మోదితు
లై సమా, తల్లిదండ్రులు పుత్రశోకముఁ దాల్చిచిక్కదురీశ్వరా. 7

మత్తకోకిల. నిన్నునీశ్వరు దేవదేవుని నిర్ణయింపఁగలేక యో
సన్నుతామలకీర్తిశోభిత సర్వలోకశరణ్య మా

యన్నయీతఁడునేఁడు నేసెమహాపరాధము నీయడన్
నన్నుమన్ననచేసికావుమనాథ నాథ దయానిధీ. 8

---

# శిఖినరసింహశతకము.

:o:

క. శ్రీయునుశుభమును విభవము
నాయువునారోగ్యమును మహాయశమునుమే
ధాయుక్తభాగ్యమును
వేయమునుగృపసేయుమయ్య శిఖినరసింహా. 1

క. వెలయుఁగ సర్వదిగంతము
లలరఁగ సామ్రాజ్యయుక్తమైనయశశ్శ్రీ
లలనావరకరుణామృత
చెలువము దయసేయుమాకు శిఖినరసింహా 2

క. ఏనుగగుఱ్ఱముబీనుగు
మానుగబసవేశ్వరుండు మరిబాల్పెరుగన్
నేనయుగొప్పగుమంటయు
శ్రీనాథాశుభములివియు శిఖినరసింహా. 3

క. నిండినకడవలు రెండుఁగ
మెండుగజేపలునునుగల్గు మించినకావి
ళ్ళిండనెగాజులసెట్టియు
చెందదు మరిదోషములను శిఖినరసింహా. 4

క. పోవద్దనబోనేయున
నేవచ్చెదనన్నయెడకేగెదనన్నన్

బోవంగని చెరగోడిసిన
జీవములకు హానియుండు శిఖినరసింహా. 5

క. వినునూతకముగుసతి వె
ల్లనిజడతల కొత్తకడవ విధవాసతియున్
బెనుగాలి ధూళియెడనెడ
జనులకు పయనంబుతగదు శిఖినరసింహా. 6

క. బాపండొక్కడుకట్టెల
మోపునుముక్కిటియుమొండి
మొనసినపోగసం
తాపముజగడము గలిగిన
శ్రీపతిపై నంబుదగదు శిఖినరసింహా. 7

క. తలపట్టుబెట్టుతలయును
తలనూనె నెర్రజడల తలవిరిదలయున్
నిలగనిపయనము బోయిన
జెలువము నెడబాసిచనును శిఖినరసింహా. 8

క. సిరులలరినశకునములకు
నెరయోజకులైన యశ్వినీదేవతలన్
గురుతరభక్తినుతించుచు
స్థిరవరసుభములొసగు శిఖినరసింహా. 9

క. పంచమహావాద్యంబులు
మిడచినభేరీధ్వనులున మెరువడిశబ్దం
బంచిత శుభవాక్యములా
లించిన శుభశకునములగు శిఖినరసింహా. 10

# ప్రయాణదినములు

—o—

క. విదియాంగారకమునజని
పదపడినలచక్రవర్తి బహుళకష్టపడెన్
ముదమునబోయిన జనులకు
చిదిసినదేహంబులగును శిఖినరసింహా. 11

క. బలిచక్రవర్తి యంతటి
బలుదున్ జెడిబోయెదదియు భార్గవపైనం
బున మానవులిల జెడరా
చెలువులు పరదేశమునను శిఖినరసింహా. 12

క. శ్రీరాముఁడు కష్టపడె
న్వారక చవితియును భానువారముగూడన్
నేరకపయనము జనినను
శ్రీరామా యితరులెంత శిఖినరసింహా. 13

క. పంచమి గురువారమువే
లెంచకజనియర్జునుండు నిలకష్టపడెన్
మంచిదినుచు బోయిన
జెంచులలోఁగలతు రవని శిఖినరసింహా. 14

క. శనివారము షష్ఠినిజని
పనిబడరావణుఁడు చెడెను బంధుసహితుడై
మనుజులు చెడు టబ్బరమా
చినయోబళపురివిహారశిఖినరసింహా. 15

క. ధనసప్తమిందువారము
దారయంబని భార్గవుండుదోర్బలశక్తిన్

సిరిబోవునాడెయితరుల
సిరులెన్నద్రణంబుగాదె శిఖినరసింహా. 16

క. అష్టమి గురువారంబున
గష్టముబహుసేయబడిరికద పాండవులన్
నష్టంబగు పయనములను
శ్రేష్టంబనరాదు పనులుశిఖినరసింహా. 18

క. ఫలములు గాయబుబుప్పల
వెలయింతెయు గన్నెసడచు విప్రద్వయముల్
దెలుపన్నము బయనమును
జెలువగు శుభశకునములగు శిఖినరసింహా. 18

## గౌళివాక్కు-అనగా బల్లిపలుకులు.

క. తలచుకపార్థనజేసిన
వలపలగౌళియును బలుకవలనగుశుభముల్
యిలపైనము కొరగాదట
చెలువగుశుభకార్యమంత్రము శిఖినరసింహా. 19

క. దాపలపల్కిన సకలము
నాపదలకు పయనములకు నీతిశుభములన్
జూపరులకుదృష్టాంతము
శ్రీపతిపాదంబులాన శిఖినరసింహా. 20

క. పురిజొచ్చినప్పుడు
నరయగదాపలను పల్కనధికఫలంబౌ

వరశుభములు శ్రీఘంబులు
శిరివరదానిజములివియు శిఖినరసింహా. 21

క. కుడిదిక్కుబలుకగార్యం
బెడనెడనాలస్యమగును యెదురుగబలుకన్
బడగొట్టినట్టుగార్యము
వెనువెనుకను బల్క శుభముశిఖినరసింహా. 22

క. తోరణగౌళియుబలికిన
నారూఢిగబంధుహిత ప్రియాంగనరాకల్
గోరినకోరికెలబ్బును
శ్రీరమణానిశ్చయంబు శిఖినరసింహా. 23

క. ధరపైనము మునువరిగా
వరదక్షిణగౌళిబలుక వరశుభఫలముల్
నెరయోధుల పెండ్లిండ్లకు
సిరులలరగ పసిడివంట శిఖినరసింహా. 24

క. యెనిమిది దినములకొక్కటి
యెనిమిదిదిక్కులకు జాముతెనిదిఫలము
ల్వినుమొక్కదిక్కునకునగు
చినయోబళగిరివిహార శిఖినరసింహా. 25

క. భయములు చింతాహానియును
క్షయమునులాభంబు ధనముసంపదశుభమున్
నయముగ నెనిమిదిజాముల
జయమింద్రునిగౌళిఫలము శిఖినరసింహా. 26

క. రోదనము రణము భుక్తియు
జూదము వస్త్రంబుధనము శుభమునుయముగా

పాదుకకొని యగ్నిమూలను
శ్రీదయితానిత్యశుభము శిఖినరసింహా. 27

క. చుట్టములాభము కోర్కము
జెట్టునుమరణంబు చింతవిందురు శుభముల్
గట్టిగ దక్షిణమందయు
చిట్టోబళగిరివిహార శిఖినరసింహా. 28

క. మరణము సంతోషముశుభ
వరిభయమసుభంబుహాని యర్థముశ్రీలున్
ధరనైనిమిదిజాములకును
స్థిరముగనైతిఫలంబు శిఖినరసింహా. 29

క. ధనమునుచుట్టము లాభము
వినుమరణము శుభముచేటుత్తముశ్రీలున్
గనుగొనపడమటి గాలియు
చినియోబళగిరివిహార శిఖినరసింహా. 30

క. మేలునులాభము ధనములు
శ్రీలునువాహనము శుభములిచ్చును జయముల్
వాలాయము వాయవ్యము
శ్రీలోలాజాముగాలి శిఖినరసింహా. 31

క. చావునులాభము శుభమును
భావముమేల్వార్తసుఖము భయమునుజయము
న్నైవెరవున ధనపతిపయి
శ్రీవెలయగజాముగాలిశిఖినరసింహా. 32

క. గండముచిచ్చుసుఖము జయ
మండలపెండ్లిండ్లు లాభమతివెలుచేటున్

ఖండితియాశాస్యంబున
చెందుము మాదోషములనుశిఖిసరసింహా. 33

# పలుకఫలములు.

క. ఒకపల్కు దనకు నమ్మగు
వికటంబుగనంది రెండువినుజగడముమూ
డకటాడగడమునాలుగు శిగబట్టపుజుమ్మియైదు శిఖిసరసింహా. 34

క. ఆరైతే శ్రీయస్కర
మేరీతినిజగడమేను నెనిమిదమరణం
బారయధన శుభఫలమగు
శ్రీరమణాతొమ్మిదింట శిఖిసరసింహా. 35

క. పదిసంపదబహుగెలుపగు
పదునొక్కటచావు. నిజము పండ్రెండైతే
పదమూడు పలుకులైతే
చెదురునుతానున్నతాతు శిఖిసరసింహా. 36

క. మునుపాండురాజ తనయులు
ననువగురాజ్యంబువిడచి యడవికిజనిరో
య్యనబదమూడగుపలుకుల
చినయోబళగిరివిహార శిఖిసరసింహా. 37

క. పదునాల్గుమేలు పదిహే
న్వదలకసీతాంగనయును వడిచెరబోయెన్
పదినుగిటహ నామంతును
చెదరక నయబ్ధిదాటె శిఖిసరసింహా. 38

క. శ్రీరాముఁడు సీతాశుభ
మారూఢిగవినిపదేఁడు నటదండైత్రేఁ
వారిధిగట్టెను శుభముగ
శ్రీరమణదశాష్టకమున శిఖినరసింహా. 39

క. నవదశకంబున రాముఁడు
జెవమున రావణునిగెల్చె సమరజయుండై
భవినిత్రిపురము గెలిచెను
శివుఁడిరువదిపలుకులొదవ శిఖినరసింహా. 40

క. దరగౌళితుమ్ము శకునము
నరయ నవగ్రహములందు నగునిజఫలముల్
దరగౌళి ముష్టిన్రాతలు
చెరిసగమగు గొంతనిజము శిఖినరసింహా. 41

---

## తుమ్ములక్షణము.

క. రెండుగ దుమ్మినఫలము
ఖండితముగ దుమ్మిచీవగామరణమగుఁ
మెండుగతుమ్ముచు నడచిన
చెందునుదోషములునరుల శిఖినరసింహా. 42

క. తుమ్ముచు దగ్గుచునడచిన
నెమ్మదిశయనించియుమియ నిజమగుబహురో
గమ్ములబాయనిజడిగా
జిమ్మును తుమ్ములఫలంబుశిఖినరసింహా. 43

క. లేచినమొసలిం జూచిన
దాచినబంగారుఫలము దరుణులనటఁగ
జూచిన వీడ్కామువేసిన
శ్రీచతురాతుమ్ముఫలము శిఖనరసింహా. 44

క. ఇలగోకిన కడకేగిన
దలగోకినజంతసేయ దడబడజీదన్
బలుగష్టము దుమ్మినతరి
శిలలై సంగష్టపడును శిఖనరసింహా. 45

క. లేచినశుభమగు దుమ్ముచు
గూచుండినవిలకడౌను గొణుగుచునుండఁగ
బాదుగ జగడముజేసిన
శ్రీచతురాకార్యహాని శిఖనరసింహా. 46

క. ఇనుమును వెండియుముట్టిన
గనుకనిచెడుకార్యమ్ము గంచునుతామ్రం
బనుజయము దుమ్ముచును హె
చ్చినదినంటక శుభమ్ము శిఖనరసింహా. 47

క. పసిబాలశిశువు లంజయు
పసగలబాలింతతుమ్మ బంగారుసుమీ
వెసమాల కుంటిశిశుతమెస
సినబహుగార్యములశిద్ధి శిఖనరసింహా. 48

క. తొత్తునుగర్భిణి గొడ్డును
ముత్తైదువవిధవ గుడ్డిమోపరితుమ్మఁ
గుత్తగమరణాంతము నీ
చిత్తము దయసేయుమయ్య శిఖనరసింహా. 49

క. చాకిలిగాండ్లది చిప్పది
మూకదినెరుకలది మొండిముక్కటివారల్
యేకడదుమ్మిన దుఃఖము
చేకూడదు ఫలమొకింత శిఖినరసింహా. 50

క. నాలుగుపదముల జీవము
లాలోచనలవుడుపయన మానెడుమమ్ముల్
వాలాయము మరణాంతము
(శ్రీలోలాదప్పదంపు) శిఖినరసింహా. 51

---

# భర్తృహరిశృంగారశతకము.

:o:

చ. చెలువపుఁదేటిలేనగవు చేతనుభావముచేత సిగ్గుచే
నలువగులీలచేత సుగుణంబులచేఁ గడఁగంటిచూపుచేఁ
గలహముచేతవిందులగు కందువమాటలచేనసూయచే
బెలుచననెంతవారి వలపింతురుకాంతలు పెక్కుభంగులన్ 1

ఉ. తమ్ములనేలు కన్నులు సుధానిధిఁబోలు మొగంబు మత్తభృం
గమ్ములగెల్చుకొప్పొకన కద్యుతిమీఱు మెఱుంగుకుంభికుం
భమ్ములనవ్వు గుబ్బచను బంతులుగొప్పపిఱుందు తేనియ
ల్చిమ్మెడు ముద్దుఁబల్కులును జేయనిసొమ్ములు సుందరాంగికిన్. 2

ఉ. ఇంచుకముద్దు లేనగవు లింపగునవ్య విలాససూక్తుల
భ్యంచితలోలదృష్టియు నవారుణ పల్లవమండలంబు ని
ర్మించు సలీలయానములు మేలుగ యౌవనలక్ష్మితోడ వ
ర్తించు మృగాక్షిచందము లతిప్రమదంబు ఘటింపఁజాలవే. 3

సీ. చూడంగతగిన వస్తువులందుఘనమెద్ది
తులలేకతగు వెలందులమొగంబు
వలపుగైకొనదగు వానిలోనెయ్యది
మగువల వదనాబ్జమారుతంబు
వీనులకింపైన వానియందెయ్యది
కోమలాంగులముద్దు గులుకుపలుకు
తనువు సోకినసుఖంబొసరించు నెయ్యది
మెలఁతసొబగైన మేనుదీన

గీ. అతిమధురమెద్ది కాంతాధరామృతంబు
సరసజనులకు జింతింపజాలునెద్ది
పువ్వుబోడుల వెలలేని జవ్వనంబు
వెలయునెయ్యెడలపడతుల విభ్రమములు. 4

చ. గొనబగుమేనసంకుమద కుంకుమపంకమెసంగసిబ్బెపుం
జనుగఁవరత్నహారములు సారెపెనంగఁబదాంబుజంబులన్
మొనసినగిల్కుటందియల మ్రోఁతచెలంగననంగ వైభవం
బెనయఁగగుల్కుకల్కిసొబ గెవ్వనిఁదావలపింపదిమ్మహిన్. 5

చ. అతివలఁజూచివీరబల లంచువచించు మహాకవీంద్రులు
ద్ధతవిపరీతవాదులిది దబ్బరగాదువిలాసినీసమం
చితతరళాక్షిపాతములచే గెలువంబడిరింద్రముఖ్యులున్
ధృతినటువంటివారబల లేగతినైరితలంచిచూడఁగన్. 6

చ. గరువపుఁజన్నులుం బెళుకుఁ గన్నులు నిల్కడలేని కన్బొమల్
మురియుచునెఱ్ఱఁబాఱు జిగి మోవియుఁ దాపముఁజేయఁగాదగున్
స్మరలిఖితోరు భాగ్యలిపి జాలమనందగి మాధ్యవర్తియై
పరఁగినరోమరాజియును బాయక తాపముఁజేయ నాయమే. 7

చ. సుదతిపయోధరంబులతిసుందరముల్ జఘనంబురమ్యమౌ
వదనముహృద్యమౌచు జలవర్తనమేటికినీకుజిత్తమా
కదలకవానిపై దలపుకల్గినబున్నెము లాచరింపుమిం
పొదవలభించునేసుకృతయోగములేక సమీహితార్థముల్ 8

చ. కనఁదగునింత జవ్వనపు గల్మికిఁదావులు ప్రౌఢసంగమం
బునకు నుపక్రమక్రియలు పుష్పధనుర్జయ దానదక్షవా
క్మనసిజచిత్తహారుల వికారనిదానములైన కామినీ
జనులవిలాసకృత్యములు సంతతరమ్యతరంబు లెన్నఁగన్. 9

మ. పరిణయశ్రీమధురంబు లుజ్జ్వలరస ప్రాచుర్యముల్ ప్రేమభూ
షణముల్ దర్శితహర్షముల్ రుచిర విశ్వాసార్ద్రముల్ ముగ్ధముల్
ఫణితిశ్రావ్యము లంగజప్రభవముల్ ప్రాణేశ్వరీనర్మభా
షణముల్ నామదిఁ గొల్లలాడెడి రహస్యక్రీడలందెప్పుడున్. 10

చ. విరహకృశాంగియైనఘనవేణి యొకర్తు వనంబులోపలం
దరువులనీడలందనుచితంబుగ మాటికి విశ్రమించి బం
ధురగతిసంచరించెజనుచోయిని బయ్యెదకొంగు గేలదా
వెరవుగబూనియగ్గలపు వెన్నెలకాకదొలంగజేయుచున్. 11

ఉ. బాలికనన్నుఁగన్గొనని పట్టునదర్శనమాత్రమబ్బినం
జాలునటంచుఁగోరెమఱి చక్కఁగఁగన్నులనన్ను జూచిప్రో
యాలుకవుంగిలింపవలె నంచుదలఁచెఁదమింగవుంగిటన్
మేలుగఁజేర్చుకొన్నపిరు మేనులునొక్కటిసేయగోరితిన్. 12

చ. తలపయిమాలతీకుసుమ దామమునెమ్మెయిఁ గుంకుమంబుతోఁ
గలసినకస్మదావి విరిగందపుఁబూఁత వెడందఱొమ్మునం
దలికులనీలకుంతల మదాలసనీలనరోహాక్షియుం
గలుగుటనింద్రభోగమనఁగాఁ దగదేమఱివేఱెయున్నదే. 13

మ. ఆదిమితాదరంబుదద నంతరమంచితరాగమంతల
జ్జోదయరమ్యమంత శిథిలోద్యమమంత నితాంతవిస్రవి
చ్ఛేదముపేర్మిపూరము విశేషవివిక్తవిహారమంతనా
హ్లాదకరాంగసంగముకుల ప్రమదాంతమల్పసౌఖ్యమే. 14

ఉ. అక్కునవ్రాలిరొప్పువిడి యల్లలనాడఁగఁ గన్నుఁదామరల్
చక్కఁగమోడ్చిచొక్కిపురుషాయిత సంజనిత శ్రమంబునం
జెక్కులఘర్మబిందువులు చిందఁగవిందొనరించు బోంట్లమే
ల్చొక్కపుమోవితేనె చవిఁజూతురుభాగ్యముగల్గునేర్పరుల్. 15

చ. ఇదియుచితంబుగాదని యిమ్మహిలో మగవారికెంతయున్
మదనసుఖాభిలాషములు మానకయున్కి జరాభరంబునం
గొదమమిటారిముద్దుచనుగుబ్బలుజారిన వెన్కబోంట్లకున్
మదనసుఖంబుజీవితము మాన్పఁడుతామరచూలిజాణయే. 16

శా. ఆశాసాగరపారమేరికిని శక్యంబౌనె చేరంగ భో
గాశాయుక్తము జవ్వనంబుగళితం బైనట్టి ధనంబేల ధా
త్రీశా యింటికిఁ బోదు మే ప్రియః వధూహృద్యోల్లసద్రూపరే
ఖాశోభాతిశయంబు దుర్భరజరా క్రాంతంబు గాకుండఁగన్. 17

చ. రతిపతిచేతివాలు ఘనరాగనివాసము నీతివైరిదు
ర్గతిశతదుఃఖమోహజని కారణముజ్జ్వల భోధతారకా
పతినిబిడాభ్రబృందము శుభప్రతిబంధము దోషసంఘసం
గతమగుసేఁగి జవ్వనము కన్నజగంబున వేఱెయున్నదే. 18

ఉ. మారునికూర్మిచుట్టమున మంచితకేళిరస హ్రదంబుశృం
గారమహీజనీరదము కంజముఖీజన దృక్చకోర రా
కారజనీశమండలము కాంతనభోమణి వార్ధియావనం
బారయఁజెందుచోవికృతి నందనివాఁడెకృతార్థుఁడిమ్మహిన్. 19

శా. గంగాధౌతశిలాతలంబు హరగోస్కంధప్రదేశాహతో
త్తుంగజ్యోత్స్నజము సిద్ధసేవిత గుహాస్తోమంబు శీతాచలో
త్సంగంబుండగ నెవ్వడోపున్నృపపాదంబుల్ తలందాల్పసా
రంగేశాబవిలోచనల్ మనసిజాస్త్రంబుల్ సతుల్ లేనిచో. 20

చ. శిలమొనమూలముల్ చిదిమి చెన్నుగనేణుకరీరకాంతిచే
లలితములైనదర్భకబళంబులు లేళ్లకునిమ్ము కానలోఁ
గలితశుకాంగనావిపుల గండసుపాండురనాగవల్లికా
దళములగోళ్ళఁ భ్రమించివని తాతతికైననొసంగుమిమ్ములన్. 21

ఉ. సారంబెక్కడలేకమిథ్యయగు సంసారంబు సన్మార్గముల్
పారంజూచినరెంమపండితులకున్ బ్రహ్మానుసంధానయో
గారూఢత్వము రూపవద్వ్యపతిరమ్యస్థూలమీనధ్వజా
గారన్యస్తశరారవింద కృతయోగ్యస్పర్శలీలాప్రియున్. 22

చ. కనుగొనయుక్తి యుక్తములు గానివిమాటలు వేయునేటికిన్
గొనబుగరెంమ మానవులకున్ భజనార్హములైనవస్తువుల్
వినుతనవీనచారు మద విభ్రమలాలస సుందరీజన
స్తనభరభిన్నమై యమరుయౌవనమున్ వనమున్ వసుంధరన్. 23

మ. మలభూయిష్టపుఁదోలుబొమ్మయగు కొమ్మంజూచివిద్వాంసుఁడుం
బులిసశ్రోణి మనోహరస్తనినవాంభోజాస్యనీలోత్పలా
క్షిఁ తాతన్వియటంచు మత్తుఁడగు హర్షించున్ రమించున్ బళి
బళియంచున్ వినుతించు మోహవికృతుల్ భావింపఁగాఁజిత్రముల్.

గీ. పడతియొక్కదాని విడిచియించుకయమృ
తంబులేదుభువి విషంబులేదు
అమృతలతాంగి యనురాగవతియైనఁ
గాక మెళఁగనేని గరళవల్లి. 25

మ. నరకద్వారము సాహసాకరము పుణ్యస్వర్గవిఘ్నంబు దు
స్తరమాయాశతపేటి దంభనిధి దోషస్థానమప్రత్యయో
త్కరసుక్షేత్రము కాలకూటమమృతాకారంబు స్త్రీయంత్రముం
ధరనెవ్వాఁడు సృజించెఁబూరుషగళోద్బంధక్రియాపాశమున్. 26

చ. అలనెలకామినీవదనమై జనియింపఁగలేదు కల్వలున్
నెలతకుఁగన్నులై యునికి నిక్కముగాదు కడానిచేనొడల్
వలనుగఁజేయలేదు కవివంచితమానసుఁడై వివేకియున్
మలమలినాంగనాతను సమాశ్రయుఁడై విహరించుచుందతఁ. 27

శా. రాకాకైరవమిత్రకాంతిహరమై రమ్యాధరోష్ఠామృతా
స్తోకంబై పిలసిల్లుమన్నరమణీ శుంభన్ముఖాబ్జంబుకిం
పాకక్ష్మాజఫలంబగున్ రుచిరమై ప్రారంభకాలంబునం
గాకోలంబు తెఱంగునన్ సరుగునం గష్టంబొసంగుందుదిన్ 28

చ. చన్నులుచక్రవాజములు చక్కనిమోముఁగరంబులబ్జముల్
గన్నులుమీలు నాభిసుడి గాఢనితంబము సైకతంబుగా
నెన్నికఁగన్నబోఁటియను నేటికిదన్వలనున్కిబాలమే
లెన్నభవాబ్ధిమజ్జనము దేమియుఁగోరనివారికిమ్మహిన్. 29

గీ. ఒకనితోఁగూడి భాషింతు రొక్కనరునిఁ
జూతురువిలాససంపద సొంపుగులుక
మఱియునొక్కనిఁదలఁతురు మనసులోనఁ
గూర్చుప్రియుఁడెవ్వఁడో ముద్దుగుమ్మలకును. 30

ఉ. చూపువిషంబు విభ్రమముసొంపు ఫణాఫలకంబుగావధూ
రూపముఁదాల్చి భోగికిని రూఢిగదూరముగా దొలంగుమీ
దాపుగసర్పదష్టునకు దప్పువిషంబు మహౌషధంబులం
బాపవధూభుజంగవిషభగ్నుని చెంతకుఁబోరుమాంత్రికుల్ 31

ఉ. ఉరగము ముట్టినానరుల కుర్విని వెజ్జులు ధర్మశీలురై
గరళ మెక్కుడింతు రధికంబుగ నాయతమేచకోత్పల
స్ఫురణ వహించి వక్రగతి బూనినమానినిచూపు సోకిన న
బురుషున కెందు మందులును బొందవు పొందరు వెజ్జు లెవ్వరున్. 32

చ. విడువక పుట్టుగ్రుడ్డునకు వృద్ధశరీరికి గుష్ఠరోగికిన్
జడునకు జాతిహీనునకు జారుని జాంగములోక్కరూకకై
కడువడి నిచ్చువారిగుణ కల్పలతల్ పదలించు కత్తులం
బడుపుబడంతులందనదు భావము జేర్చునె మెవ్వ డేనియున్ 33

చ. కలదుగదా సుధారసము కంజదళాక్షుల ముద్దుబల్కులన్
వెలయుగదా హాలాహలము వీరల చిత్తమునందు గావునన్
బలుమఱు బల్లవాధరము బానమొనర్తురు నిందువేమరున్
బలితపుటొమ్ము ముష్టితల పాతములం బరిహరింతు రెంతయున్ 34

చ. కలికి మెఱుంగువాలు దెలి గన్నులు పన్నపు గౌను సైగపై
నలరెడు సద్వళీలతలు నంచితయౌవనదర్పలక్ష్మిచే
గులికెడు సిబ్బెపున్వలుద గుబ్బలు నుంగలమించు బోండ్లగూ
పులు గని నిర్వికారులగు పూరుషులే కృతకృత్యులిద్ధరన్. 35

ఉ. మానిని యేల చిమ్మెదవు మాపయి మంథరదృష్టిపాతముల్
మానుము నీ శ్రమంబు విఫలం బిది వింతలమైతి మిద్ధరన్
మానుగ జవ్వనం బడగె మానసవృత్తి వసంబు గోరున
జ్ఞానము నష్టమయ్యె యవసంబుగ జూచెద మెల్లలోకమున్. 36

ఉ. నీలసరోజపత్రకమనీయ విషాహరణ ప్రవీణదృ
గ్జాలము లీలతాంగి వెదచల్లెదు నాపయి నేమి గోరెనో
మాతూ లెసమస్తమోహవికృతుల్ రతివల్లభభిల్లభల్లసూ
జ్వాలలడంగె మా కుదవవైఖరి మానదు బోటి నేటికిన్. 37

మ. మనిసింపొందఁగ ధీరులారకరుణా మైత్రీమనీషాక్షమా
వనితాసంగమ మాచరింపుఁడెపుడున్ భామాసుఖంబస్థిరం
బనివర్జింపుఁడు హారరమ్య కుచముల్ ప్రాంచచ్ఛ్రోణీమేఖలా
ధ్వనితాలంబితంబముల్ నరకబాధల్మాన్పి రక్షించునే. 38

చ. నిగమసుభాషితాభ్యసన నిష్ఠలుగల్గిన యట్టిపండితుల్
మగువలపొందు నింద్యమని మాటికివార్తలు జెప్పనేర్పరుల్
జగమున నెవ్వఁడోపు విలసత్కురువింద మణిప్రభాధగ
ద్ధగితకలావరమ్య వనితాజఘనంబుఁ బరిత్యజింపఁగాన్ 39

గీ. శాస్త్రవిదుఁడైన బుధుడైన సనయుఁడైన
సద్గతికిఁబోవుటరిది సంసారసరణి
యమపురద్వారముల కవాటములఁగుంచి
కలుముబలెవిప్పుచున్నవి కలికిబోమలు. 40

చ. కరముకృశించికాల్వఁదిగి కన్నులుగానకపుచ్ఛహీనమై
పురుగులుగ్రమ్ముచున్నవ్రణపుంజముమేనలముంగనాఁకటం
బరవశమైటీముఖ కపాలగళంబగుకుక్కపెంటితో
నరిగెమఁగూళజంతులనైన వధించుమనోజుఁడక్కటా. 41

చ. స్మరునకుసర్వలోకజయ సంపదలీయఁగజాలుప్రౌఢలం
దరుణులందసేయుట నధర్మ్ములుగొందఱుమానవుల్దిగం
బరులునుబ్రహ్మచారులుఁగ పాలకపాణులుచండహస్తులై
దిరుగుచునున్నవారు రతిదేవునిమీఱిభోగమబ్బునే. 42

చ. వనదళవాతముల్మెసవువారు పరాశరకౌశికాదులా
ఘనులునుసుందరీజనుల గన్గొనిమోహితచిత్తులైరి పె
చ్చినఘృతపాయసాన్నము భుజించెడివారలకున్మనోజయం
బునెగడునేనివింధ్యము సముద్రజలంబులఁదేలియాడదే. 43

గీ. అంగజునిగంధసింధురం బనఁగఁబరగు
మలయజసుగంధిమలయాద్రి మారుతంబు
మలయ దెందాఁక సందాఁక మానవతుల
మానసంబులనెలకొని మానమమరు. 44

చ. అతిసితచందనార్ద్ర రుచిరాంగులు భామినులున్ సుగంధసం
గతమగుమందమారుతముఁ గౌముదియుఁ జలయంత్ర గేహము
న్నతశుచిసౌధభాగము ఘనంబగువాసనఁబూనుపుష్పసం
తతియుమదంబు దర్పకుని దర్పముఁ బెంపుగఁ జేయువేసవిన్. 45

ఉ. కమ్మనిదండలున్ సురఁటి గాడ్పులు వెన్నెలంయుంబరాగపు
జమ్మనుమంచిగంధమును సన్నపువల్వలు శీధుపానముం
దమ్మికొలంకు మేడయును దామరసాక్షులనంగ నొప్పుభో
గమ్ములు పుణ్యవంతులకుఁ లభింపవటంద్రువేసవిన్. 46

చ. ఘనతిమిరంబు నూదికవకాశమొసంగమి మీఁదవారిద
స్వనములమిన్ను పిక్కటిల్ల వారికణంబులు రాలుచుండఁగాఁ
గనకపురేఖలందెగడు కాఱుమెరుంగులు జారకామినీ
జనములకున్ ముదంబును విషాదమునుం బ్రకటించెఁ బ్రావలన్. 47

ఉ. కేరుచు మేడనుండి వెలికింజనశక్యముగాక యుండెనా
సారముచేతశీతమున జవ్వనికౌఁగిలి గల్గెశీకరో
దారసమీరణంబు సురతశ్రమవారణమయ్యె దుర్దినం
బారయనయ్యెడన్ సుదినమయ్యెఁగృతార్థులకంగనారతిన్. 48

చ. ప్రియముగ రేసగంబునిమరించి నితాంతరతాంతవిహ్వలుం
డయిదగఁజెంది యాసవమదాలసుఁడై రతిఖిన్న కామినీ
శయమునఁగర్కరీగళిత చంద్రవిభాచ్ఛశరజ్జలంబులా
రయఁగృతపుణ్యుఁడింపెసఁగఁ ద్రాగుహాస్థితసౌధసీమలన్. 49

ఉ. చెక్కులుముద్దుగొంచు ముఖసీమనుసీత్కృతులన్ఘటించుచుం
జక్కనిచన్గవంబులకజాలములన్ మొలపించుచుంగటిం
జెక్కినచేలముందొలఁగఁ జేయుచు శైశిరమారుతంబులిం
పెక్కఁగ గాంతలందువిట కృత్యముఁబూని చరించునత్తరిన్. 50

---

# సంపగిమన్న శతకము.

క. శ్రీమానినీమనోహర
సోమార్కవిశాలనేత్ర సురనుతగాత్రా
దామోదరనీలమణి
శ్యామానన్నుబ్రోవుమన్న సంపగిమన్న. 1

క. పరమానంద యతీంద్రుడ
పరిపూర్ణుడవైన నీదుభక్తుడనెలమిన్
విరచించెద నొకశతకము
శరణాగతసుప్రసన్న సంపగిమన్న. 2

క. తాటాకులలోవ్రాసిన
మాటలనాముక్తిపాటి మర్మము తెలియన్
సూటైన రాజయోగము
సాటౌనా యెచటనున్న సంపగిమన్న. 3

క. గామువలెసంచరించిన
బామువలెన్ గుహలనున్న బంధముదెగునా
దీమెరిగి పరులగలసెడి
సామర్థ్యముగూడకున్న సంపగిమన్న. 4

క. మాయనగా వేరేయొక
తోయములేదయ్య తన్ను దోచనిచోటే
మాయతను దోచితే చూ
చాయం జెడిపోవునన్న సంపగిమన్నా. 5

క. మండితపూర్ణసుధాకర
మండలశతకోటికాంతి మహనీయుండై
నిండితనలోన యోగి ప్ర
చండగతిన్ వెల్గునన్న సంపగిమన్నా. 6

క. మాయాయోగ తపంబులు
నాయాసముతోడజేయ నబ్బునెతత్వం
బాయెన్ని కేలపెట్టన్
జాయలనాసుప్రిసన్న సంపగిమన్నా. 7

క. పేరెకోను మంత్రివాదము
భారంబది కుక్కనోటి పాతై పోతై
పూరై యూరై దూరై
జారగవలెనువ్రవనన్న సంపగిమన్నా. 8

క. బూటకములు వేషంబులు
నాటకములు మంత్రతంత్రనటనలుమిథ్యా
పేటికములు యోగికి జం
ఝాటములవియేలనన్న సంపగిమన్నా. 9

క. అభ్యుదయంబుగ నీయో
గాభ్యానము సేయవలయు నతులితలీలన్
లభ్యంగుడ నుచిదాత్ముడు
సభ్యులకదిమార్గమన్న సంపగిమన్నా. 10

క. వ్యక్తావ్యక్త పదంబట
ముక్తట గురుసేవతనకు మునులేదటయే
యుక్తిని గనుగొనవచ్చున
శక్తులకును నుపన్నిసన్న సంపగిమన్న. 11

క. భావమునన్ గననేరని
జీవులకిదిబీరకాయ చిక్కగుదెలియం
గావశమాసద్గురు దీ
క్షావిధియెనగూడకున్న సంపగిమన్న. 12

క. బోధింపతగిన గురువుల
శోధించితదంఘ్రిజేరి సుస్థిరమతియై
యాధార నిరాధారము
సాధించినముక్తుడన్న సంపగిమన్న. 13

క. సాధింపగ నిరతులకుగా
బోధింపగనేర్పుగలుగు పుణ్యాత్ములయా
యాధరగలరొక్కొందరు
సాధారణవిబుధులెన్న సంపగిమన్న. 14

క. అనుభవమెరుగని గురుచే
వినునతనికిసంశయంబు వీడునెచిత్తా
ర్తునివలనతమము బాయునె
సనకాదిమునిప్రసన్న సంపగిమన్న. 15

క. గురువట యెవరికిగురువో
హరిహరితను దెలియలేని యాతడుగురువా
గురువనగసిగ్గుగాదా
శరణాగతసుపన్నిసన్న సంపగిమన్న. 16

క. బూటకపుయోగి నెఱుగక
పాటింతురుడబ్బుజూచి పసలేకుండే
తాటోటని జగమెల్లను
సాటింతురు లోకులెల్లసంపగిమన్నా. 17

క. కల్లయగు జ్ఞానమేలా
చెల్లునకాసెచటనైన చెల్లునికాసే
తెల్లముగ దెల్పు నాతడు
సల్లలితజ్ఞానదాన్న సంపగిమన్నా. 18

క. గాఢీదేవత బూడిదెచె
ల్లాడుచుకొక్కెరయుబోలిధ్యానముజేసి యూ
గడపుకపటయోగుల
జాడలుఘనునెంచకన్న సంపగిమన్నా. 19

క. వీడోపగెను గురుడేలా
గాఢిదేవాలంబుబట్టి కావేగిదగ
గూడునెగుండేలు పగులగ
ఝాడించదేహోమ్ముగన్న సంపగిమన్నా. 20

క. అంగాబెరుగరు సుక్తితె
రంగెరుగరు కపటభూర్తదానవవేషుల్
దొంగలుగురువులు వారల
సంగతిమానోభితాన్న సంపగిమన్నా. 21

క. వచ్చినదానవ వెంబడి
విచ్చలవిడియోగిగురుడు విహరించినవా
డెచ్చట నేక్రియజేసిన
నచ్చిన్మయుఁడంటవన్న సంపగిమన్నా. 22

క. విత్తమదమత్తు లాయత
చిత్తభ్రమ లెరుగలేరు చిత్పురుషునిదా
నుత్తముఁడితఁడని సన్ముని
సత్తముఁడే యెఱుఁగు నన్న సంపఁగిమన్న. 23

క. తనవాసన యెట్లుండిన
ఘనయోగికిబంధవృత్తి గానేరదు వా
డనుభవము కతన నిత్యా
ననుఁడై మఱిపుట్టఁడన్న సంపఁగిమన్న. 24

క. క్రమమున సుఖదుఃఖములు
కమలిననుతి నిందలాదిగాఁ గలిగినదా
యమివర్యుఁడన్న క్రియలన్
సముఁడై వర్తించు నన్న సంపఁగిమన్న. 25

క. తలకొని దుఃఖము రానీ
వలనొప్పఁగ నిత్యసుఖము వచ్చినరానీ
నలుకువను బడని మనుజుఁడు
చలియింపఁడు బోధగన్న సంపఁగిమన్న. 26

క. చాలాలోకులు నగనీ
వాలాయము కీడుమేలు వచ్చినరానీ
యేలాగైనను పురుషుఁడు
జాలింబడఁడాత్మగన్న సంపఁగిమన్న. 27

క. బాలుఁడుగానీ భోగస్త్రీ
లోలుఁడుగాని విషయశీలుఁడుగానీ
మేలైన బోధ గలిగిన
చాలాదె మఱేముక్తిగన్న సంపఁగిమన్న. 28

క. విత్తపరాయణుఁడైనా
మత్తచకోరాక్షులందు మగ్నుండైనా
నుత్తమ పురుషుఁడె కాఁడా
సత్తామాత్రుంబుగన్న సంపగిమన్నా. 29

క. పంచావస్థల దగిలియు
పంచావస్థలను గడచు ప్రాజ్ఞుండు జగ
ద్వంచకుఁడై లోకులవలె
సంచారము సేయుచున్న సంపగిమన్నా. 30

క. ఒప్పలరనాత్మ సుఖమున
తెప్పం దేలేటియోగి దెలియకతమలో
సప్పురుషునిగని కర్మలు
చప్పనగాజూతురన్న సంపగిమన్నా. 31

క. నిత్యా నిత్యంబెరుగక
నిత్యము చేపట్టుబుధుల నిందించినచో
మృత్యువుపాలౌ మర్త్యుడు
సత్యంబిది వినగదన్న సంపగిమన్నా. 32

క. ఊరెరిగిన బాపనికి
వారకజన్నిదము జూపవలెనా తజ్జ్ఞుం
డేరీతినున్న నిస్సం
సారనిఘను లెంతురన్న సంపగిమన్నా. 33

క. అద్వైతభావమెరుగక
విద్వాంసుల మనుచునాత్మ వేత్తలవలెనే
యద్వాతద్వము లాడుచు
సద్వర్తనమెంచరన్న సంపగిమన్నా. 34

క. వదలరువిషయము లెచటను
మొదలెరుగ జనులకడల మిథ్యాజ్ఞానుల్
చదివితిమని ప్రాజ్ఞులతో
చదువులు పచరింతురన్న సంపగిమన్న. 35

క. జడివాన గురిసినట్లన్
విడువక వాదింతురాత్మ వేత్తల నెనుచున్
కుడియెడ మెరుగనిమాటల
జడమతులగు కొందరన్న సంపగిమన్న. 36

క. కొందరు యోగంబనగా
కొందరుజ్ఞానంబనంగ కొంద రఖండా
నందంబనంగ నందుల
సందేహము దీరదన్న సంపగిమన్న. 37

క. తుదమొదలెరుగక బ్రహ్మం
బిదియని మెరుగంగలేక యేర్పడసభలన్
వదరుచుతిరిగే కొయ్యల
చదువులపసలెన్నసున్న సంపగిమన్నా. 38

క. దేహము తానై తేమరి
దేహముతోకూడ గాలి తేనేనిజమా
దేహాత్మవాది మాటలు
సాహసములు బొంకులన్న సంపగిమన్న. 39

క. సన్యాసులమని శాస్త్రి
సన్యాసముజేయనందు ఫలమేమి మన
స్సన్యాసము దొరకొనమిన్
సన్యాసము గూడదన్న సంపగిమన్న. 40

క. వాదులనడచే పెద్దల
గాదనగానేలవట్టి కలహాంబింతే
ఖేదంబని చాలించిన
సాదరమతిజాణడన్న సంపగిమన్నా. 41

క. వాదములనగా ధాత్రి వి
వాదంబులు యంత్రతంత్రవాదంబులునున్
జూదము మేదిని మెత్తురె
సాదరమతులెన్నరన్న సంపగిమన్నా. 42

క. చేతోగతినెరిగిన వా
రేతీరునవిధినిషేధ మెరుగకయున్నన్
జాతురుసమరస భావన
చాతుర్యధురీణులెన్న సంపగిమన్నా. 43

క. ఎప్పుడుకర్మముజేసే
యప్పురుషుడుతన్నుగన్న యదిచాలించున్
చప్పిడిగా దానోటికి
చప్పనియాపిప్పిదన్న సంపగిమన్నా. 44

క. సూతకమువచ్చె ననుచును
నాతలపదినాళ్ళుజపి సంతనె తెగునా
సూతకమే కాదాతన
జాతకమే యెరిగికొన్న సంపగిమన్నా. 45

క. కలలోనొక్కడు పులిగని
పులిచేనకటగనుచు తాను పులియునుబొంకా
కలవలెనే జగమెల్లను
లలితభక్తిపరిన్న సంపగిమన్నా. 46

క. తనమనసే తానాయెను
తనమనసేతన్ను దెలియ తత్వంబయ్యెన్
మనసుకు మనసేసాక్షియు
సనకాదిమునిప్రసన్న సంపగిమన్న. 47

క. మనసే జీవుండనగను
మనసీతనచేష్టలుడుగ మరితత్వమగుఁ
మనసుగలవాఁడె ముక్తుడు
సనకాదిమునిప్రసన్న సంపగిమన్న. 48

క. సత్తనబరగును పురుషుడు
సత్తుగాఁ బ్రకృతిదోఁచి సమసెటికతనఁ
సత్తునకేనిత్యత్వము
సత్తునకది కూడదన్న సంపగిమన్న. 49

క. లక్షణమెరుగని యోగివ
లక్షణమగు నతనిమాట లవిన్లరువుల్
దక్షతనంతర్ద్రుష్టి వి
చక్షణుడాకామునన్న సంపగిమన్న. 50

క. సప్తపదార్థంబగు నీ
సృష్టిని నుపసంహరించి చిన్మయునంత
ర్ద్రుష్టినిగనవలె జనునక
సప్తతనం బేటికన్న సంపగిమన్న 51

క. చింతించియోగి మోక్షా
నంతసుఖంబొందువ చక్షురింగ్రింబునదా
నంతర్ద్రుష్టిని గనవలె
నంతతమునునాత్మగన్న సంపగిమన్న. 52

క. తనకనుభవంబు చదువుల
వినుకులనేలగలుగుననెడి వెఱ్ఱులుగలరా
యనుభవవేద్యము బ్రహ్మము
సనకాదిమునిప్రసన్న సంపగిమన్న. 53

క. తెరచీతెరవని కన్నులు
మరచీమరువనితలంపు మ్రాన్పడుమేనున్
పరమచిదాకాశస్థితి
చరితార్థమునిలుచునన్న సంపగిమన్న. 54

క. నలుగురునడిచే త్రోవను
బలిమైలోకంబునడచు ప్రాజ్ఞుండైతే
నలుగురు నడువనిత్రోవను
చలియింపకనడచునన్న సంపగిమన్న. 55

క. మనసెక్కడ మాయెక్కడ
తనువెక్కడనున్నవారు తత్త్వముతెలిచటు
ఘనరాజయోగములవడు
జనునకుదాసుపరిసన్న సంపగిమన్న. 56

క. మిక్కిలిసంసారైతే
యెక్కడియోగమురుచిచ్చు నెక్కుడుశైత్యం
బెక్కినకోటికిచేదవు
చక్కెరపాకిదిన్నైన సంపగిమన్న. 57

క. పందలగుచెనటి మనుజుల
కందంబగు రాజయోగమలవడనేలా
పందులకును గాడిదెలకు
చందనగుణమేటికన్న సంపగిమన్న. 58

క. ఇప్పుడప్పులందనేరని
మొప్పెలకును దెలుపవశమె ముందరగానే
తప్పులుపట్టుచు మరిచే
చప్పట్లిడినగుదురన్న సంపగిమన్న. 59

క. కనుచెదర మనసుజెదరుం గనుజెదరం
సుఖముజెదరు గాలియుజెదరుఁ
గనుజెదరక గనుగొనవలె
సనకాదిముని ప్రసన్న సంపగిమన్న. 60

క. ముందువెనుకెరుగ కాటల
సందడిబడి మోక్షసుఖము సాధింపనియా
పందల బ్రతుకులుయికనే
చందంబోమెఱుగమన్న సంపగిమన్న. 61

క. శోధింపరు తత్వజ్ఞుల
నీధర తమతోటిసరికి నీదుర్మనుజుల్
మేధావంతులు పెద్దలు
సాధువులనియెచటనున్న సంపగిమన్న. 62

క. కీలెరిగి జీవపదముల
నోలింపమగసముచేసి యోగానందుల్
బోలోన్మత్తపిశాచుల
చాలుగవర్తింతురన్న సంపగిమన్న. 63

క. పాపపువాసన విషయము
కాపాడుచురాగనరుడు గడువగగలడా
యేపట్టునగు హేయ్యాదర
చాలప్యముమానదన్న సంపగిమన్న. 64

క. వెక్కసముండు మనుజుల
మక్కువతోఁ బుద్ధిఁజెప్పి మాఁన్పగగలరా
కుక్కలతోఁ కలుగట్టిన
చక్కనగాదీరవన్న నంపగిమన్న.

మూడవభాగము సంపూర్ణము.



శ్రీ సత్యానంద ప్రెస్, ఇన్నీసుపేట, రాజమండ్రి.